# జనవేమన

## గబ్బిట దుర్గాప్రసాద్

### అంకితము





## చార్లెస్ ఫిలిప్ బ్రౌన్

ప్రచురణ :

## సరసభారతి

### సాహిత్య సాంస్కృతిక సంస్థ

ఉయ్యూరు, కృష్ణాజిల్లా

# Jana Vemana

# జనవేమన

ప్రథమ ముద్రణ - 600 ప్రతులు

శ్రీ నందన - చైత్ర మాసం

రచన : గబ్బిట దుర్గాప్రసాద్
ఎమ్.ఎ., బి.ఎస్.సి., బి.యిడి

ప్రచురణ : సరసభారతి
సాహిత్య సాంస్కృతిక సంస్థ
ఉయ్యూరు.

ప్రతులకు : గబ్బిట దుర్గాప్రసాద్
అధ్యక్షులు - సరసభారతి
శివాలయంవీధి, రాజాగారి కోటదగ్గర,
ఉయ్యూరు - 521 165. కృష్ణాజిల్లా.

ఫోన్ : 08676-232797
9989066375

ఇ.మెయిల్ : gabbita.prasad@gmail.com
sarasabharathi.vuyyuru@gmail.com
http://sarasabharati.wordpress.com
http://suvarchalanjaneyaswamy.wordpress.com

వెల : అమూల్యం

డి.టి.పి. : వంశీ కంప్యూటర్స్,
సెల్ నెం. : 9248768889

ముద్రణ : సిరి గిరిజా ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ.

# ఇదీ వరుస క్రమం

# నిత్యస్మరణీయుడు బ్రౌన్

తెలుగు జాతికి నిత్యస్మరణీయిడు ఛార్లెస్ ఫిలిఫ్ బ్రౌన్. 86 ఏళ్ళ సఫల జీవనంలో 66 ఏళ్ళు తెలుగు భాషా సాహిత్య సేవలో జీవితాన్ని ధన్యం చేసుకొన్న ఆంగ్లేయిడు. ఆయనే లేకపోతే తెలుగు ప్రాచీన గ్రంథాలు ఎన్నో వెలుగు చూసేవి కావు. వేమన అంటే ఎవరో తెలిసేదికాదు. తెలుగు వారికి పనికివచ్చే నిఘంటు నిర్మాణం అంత త్వరగా జరిగి వుండేది కాదు. వృత్తి మేజిస్ట్రేట్ పదవి అయినా, ప్రవృత్తి తెలుగు భాషా సేవగా జీవించిన వాడు బ్రౌన్. కాటన్ దొర డెల్టా సస్య శ్యామలానికి ఎంత కృషి చేశాడో ఆంధ్ర భాషాభివృద్ధికి బ్రౌన్ అంత కృషి చేశాడు. అందుకే వారిద్దరూ మనకు ప్రాత స్మరణీయిలయ్యారు.

క్రీస్తు శకం 1798 లో మన దేశంలోనే కలకత్తా నగరంలో బ్రౌన్ జన్మించాడు. తండ్రి డేవిడ్ బ్రౌన్ ప్రోత్సాహంతో చిన్న తనంలోనే దేశీయ భాష హిందుస్తానీతో పాటు లాటిన్, గ్రీక్, అరబిక్, హీబ్రు భాషలను నేర్చాడు. తండ్రి చర్చిలో ఉద్యోగి. ఆయనకు సాయం చేస్తూ అచ్చు అయిన కాగితాల ప్రూఫులను దిద్దేవాడు. తండ్రి మరణంతో ఇంగ్లాండు చేరాడు. ఐదేళ్ళు అక్కడే గడిపి 1817 లో మద్రాసు వచ్చాడు. అప్పటిదాకా తెలుగు భాష అనే భాష ఒకటి ఉంది అన్న సంగతే అతనికి తెలియదు. అంటే 19 ఏళ్ళు వచ్చే దాకా తెలుగు వాసన సోకని మనిషి. అప్పటి నుంచి 40 ఏళ్ళ పాటు అంటే 1855 వరకు ఏ కొద్ది కాలంలోనో తప్ప భారత దేశంలోనే అది మద్రాసు, బందరు, కడప ప్రాంతాలలోనే ఉన్నాడు. దానితో తెలుగు భాషపై ఆసక్తి కలిగి ప్రవేశం పొంది ఆ భాషా సేవలో జీవించాడు. ఉద్యోగ ధర్మానికేమీ భంగం లేకుండా సర్వ సమర్ధవంతంగా నిర్వహిస్తూనే తెలుగుబాషాభివృద్ధికి కృషి చేశాడు. బ్రిటిష్ కంపెని ఉద్యోగంలో క్షణం విశ్రాంతి లేకుండా ఉండేది. అయినా విశ్రాంతి





సమయంలో స్వంత డబ్బు ఖర్చు చేస్తూ అమూల్యమైన సేవ చేశాడు. తెలుగువారు అతడిని తమ వాడిగా ఆప్తుడిగా భావించారు. తమ ఏడుగడ, సచివులు సారథి అనుకొన్నారు. తెలుగు ప్రాంతంలో సుమారు 40 ఏళ్ళు గడిపి బ్రౌన్ చేసిన బాషా సేవ అత్యంత విలువైనది.

బ్రౌన్ తెలుగుకు చేసిన బాషా సేవను అయిదు దశలుగా భావించవచ్చు. మొదటి దశలో 1829లో అంటే తన 31వ ఏట వేమన పద్యాలను సేకరించి పరిష్కరించి ఆంగ్లీకరించి లోకానికి అందించాడు. అప్పటిదాకా వేమన అంటే అట వెలదులతో ఆడుకొన్నవాడనే తెలికభావం పండితలోకంలో ఉండేది. ఆయనను కవిగా గుర్తించనేలేదు. ఎప్పుడైతే దొర వీటిని ఆంగ్లంలోకి తర్జుమా చేసి గౌరవం కలిగించాడో అప్పుడు వేమన మనవాడు అనే భావన కలిగింది. ఆ ఘన కార్యాన్ని మొదటి సాధించి తెలుగు వారి జాతీయ చందో వైభవాన్ని, వేమన రచనా చమత్క ృతిని, సంఘ దురాచార నిర్మూలనానికి ఆయన చేసిన కృషిని ఎరుకపరచాడు బ్రౌన్. అదొక గొప్ప ముందడుగు.

తాళపత్ర గ్రంథాలలో నిక్షిప్తమై యుండి ఎవ్వరి దృషి సోకని, వెలుగు చూడని తెలుగు కావ్యాలను ఉద్ధరించటం రెండవ దశ. స్వంత ఖర్చులతో ఎంతో మంది కవి పండితులను నియమించుకొని వారిని వాటి పరిష్కార బాధ్యతను అప్పగించి శుద్ధ మేలు ప్రతులను తయారు చేయించి ముద్రింప చేయటం రెండవ దశ. దీనికి సాయపడిన ధూలూరి అప్పయ్య, రావిపాటి గురుమూర్తి, పద్యం అద్వైత బ్రహ్మశాస్త్రి గార్లు బహు ప్రశంసనీయులు. మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైన ప్రభందాలకు విపులమైన ఉపయోగకరమైన వ్యాఖ్యలు వ్రాయించి సామాన్య జనాలకు చేరువ చేశాడు. ఇందులో బ్రౌన్ కృషి విశిష్టం అని విమర్శకుల, విశ్లేషకుల ఏకగ్రీవ అభిప్రాయం.

పాశ్చాత్యులకు తెలుగు నేర్పటం అలాగే తెలుగువారు ఆంగ్లం నేర్చుకోవటం చాలా కష్టంగా ఉన్న రోజులవి. దీని కోసం నిఘంటు నిర్మాణం జరగాలని భావించి ఆ దిశలో కృషి చేయడం మూడవ దశ. 1852-53లో అచ్చు అయిన నిఘంటువులన్ని ఆయన కృషి ఫలితమే. 1854లో ముద్రింపబడిన "మిశ్ర బాష నిఘంటువు" బహు ప్రయోజనాలను సాధించిది. మంచి వ్యాకరణం వ్రాయలనే తలంపు బ్రౌన్‌కు ఉండేది. ఆ కృషిలో వచ్చినవే తెలుగు వ్యాకరణం, తెలుగు వాచకాలు, చందస్సు మీద వ్యాసాలు. ఇవి కాక వివిధ విషయాలపై వ్రాసినవన్ని సంపుటీకరించాడు. ఇది నాల్గవ విభాగం. హిందూ, ముస్లిం చరిత్రకు సంబంధించిన కాలనిర్ణయ పట్టికలు, క్రైస్తవ మత సంబంధమైన రచనలు చేశాడు. ఇది అయిదవ విభాగంగా భావిస్తారు.

వీటి అన్నిటికి మించిన కృషి అమూల్యమైన తాళపత్ర గ్రంధాల సేకరణ. దేశీయ మేధావులైన ఏనుగుల వీరాసామయ్య, కావలి బొర్రయ్య వంటి వారు బ్రౌన్‌కు సన్నిహితులు. వారి ద్వారానే భారతీయ సంస్కృతి వికాసాన్ని అర్ధం చేసుకొని దాని వికసనాన్నికి తోడ్పడాడు. తెలుగు లిపిని సంస్కరించి అచ్చు వేయటానికి తగినట్లు అక్షరాలను మార్పించారు. మాటలకు తగిన అర్ధాన్ని వివరించి వ్రాయించేవాడు. పండితులకు సరైన అర్ధం తట్టకపోతే తానే తెలియచేసి ఒప్పించేవా డు. శాసనాల కోసం, స్థల వివరాల కోసం, గ్రామ నామాల ఔచిత్యం కోసం ఆయన తిరగని గ్రామం లేదు. ఉద్యోగరిత్యా ఏ ప్రదేశం వెళ్ళినా ఆ చుట్టు ప్రక్కల ఉన్న తాళపత్ర గ్రంధాలను వాకబు చేసి కలుసుకొని మాట్లాడి సంపాదించి చక్కని పరిష్కరణ చేయించి ప్రచురించేవాడు. ఆంధ్రదేశంలోనే కాదు ఏ రాష్ట్రంలో ఉన్న ఆ బాషాభివృద్ధికి దోహదపడేవారు. ప్రజల ఆచారవ్యవహారాలను ఆకళింపు చేసుకునేవారు. సాహిత్యంలో అది ఎలా కలిసిపోయాయో విశితంగా పరిశిలించాడు.





ముద్రణ ద్వారా సాహిత్య వ్యాప్తి ఎక్కువగా చేయవచ్చు అని భావించి అచ్చు యంత్రాలను తెప్పించి సులభతరంగా ముద్రించే ఏర్పాటు చేశాడు. అనవసరమైన అక్షరాలను తొలగించి ఒత్తుల విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు.

బ్రౌన్ మానవత్వం ఉన్న ఆఫీసరు. కరువు కాటకలలో విలవిలాడుతున్న జనానికి ఆత్మబందువుగా వ్యవహరించాడు. ధర్మత్పరతను ధర్మ బుద్దిని నమ్మి సహాయం చేసేవాడు. ఎంతో మందితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు. దొరను అడగటానికి ఎవరికి సంకోచం ఉండేది కాదు. అందరివాడు అనిపించుకున్నాడు. న్యాయంగా నిర్దుష్ట పరిపాలన చేయాలని ఆరాటపడేవాడు. లంచం తినే అధికారులపాటి సింహస్వప్నంగా ఉండేవాడు. ఆయన కాలంలో యోగ్యులైన వారికి అపకారం జరుగలేదు. బ్రౌన్ వల్ల సత్కరింపబడని పండితుడు ఆనాడు లేడు అంటే అతిశయోక్తి కాదు.

న్యాయ దృష్టి, న్యాయ నిర్వహణలో నేర్పు, స్వార్ధ రాహిత్యం, కల్మషరహితమైన మనస్సు, సత్యపాలన బ్రౌన్‌కు ఇష్టం. తనను పొగిడేవారికంటే నమ్మినదానిని నిర్మోహటంగా చెప్పేవారంటే మహా ఇష్టం అలాంటి వారిలో అయోధ్యపురం కృష్ణారెడ్డి ఒకరు. తను ఇంటి దగ్గర ఉన్న బ్రాహ్మణుడు చనిపోతే అతని భార్య సహగమనం చేయటానికి ప్రయత్నిస్తే స్మశానానికి తానే స్వయంగా హాజరై ఆమెను రాకుండా కట్టడి చేసి శవదహనాన్ని దగ్గరుండి జరిపించాడు. సహగమనం క్రూరమని దానిని ఆపటం తన దర్మమని చేసిన మహోపకారమిది. ఆ కుటుంబానికి తల్లిని ఆసరాగా నిలబెట్టి కుటుంబాన్ని కాపాడిన సంస్కారి.

తెలుగువారిని అక్ష్యరాస్యులను చేయాలనే తపన బ్రౌన్‌కు ఉండేది. వారి కోసం బడులు పెట్టించి హిందీ, పార్శి బాషను కూడా నేర్పించాడు.

మద్రాసులో "ధర్మబడి" స్థాపించి ఇంగ్లీష్, తమిళం, తెలుగు నేర్పించాడు. బీదలకు ఇవి బాగా ఉపయోగపడేవి. వారికి బోజన వసతి సౌకర్యం కూడా కల్పించాడు. భారతీయులు ఆంగ్లేయులు ఒకరి బాషను ఇంకొకరు నేరిస్తేనే ప్రయోజనం అన్నారు. తెలుగువారి విద్యాత్పరతను శ్లాఘించాడు. తెలుగు విద్యావేత్తలను చులకన చేసే అధికారులను క్షమించేవాడు కాదు. సదభావనే బ్రౌన్‌ను ప్రజల మనిషిని చేసింది. దేశ కాల జాతి మత భాషాతీతంగా పనిచేసి సహృదయుల మన్ననలను పొందాలి అని ఉద్యోగులకు బోధించేవాడు. తెలుగువారి కంటే తెలుగును అత్యధికంగా ప్రేమించి తెలుగు భాషా సాహిత్యాభివృద్ధికి కృషి చేసిన కార్యదక్షుడు, నిష్కామ కర్మయోగి బ్రౌన్.

తెలుగులో తాను ఎంత వ్రాసిన, తెలుసుకున్న, సేవ చేసిన, సంపాదించిన, బాషా విషయంలోనూ నుడికారంలోనూ తుది మాట తెలుగు ప్రజలదే అని నమ్మి గుర్తించి ప్రవర్తించినవాడు. ఇంతటి సంస్కారం అరుదైన విషయం. అందరి సలహాలు స్వీకరించేవాడు. అహంకారం, అధికార గర్వం లేకుండా ప్రజాభిప్రాయ సేకరణ చేసేవాడు. తన పరిధి ఏమిటో తెలుసుకొని ప్రవర్తించిన విశిష్ట బాషా సేవకుడు బ్రౌన్. బ్రౌన్ 1855లో స్వదేశమైన ఇంగ్లాండ్ చేరాడు. 1884లో మరణించేవారకు అక్కడే ఉండి ఆంద్రబాషకు సేవచేస్తూనే ఉన్నాడు. అక్కడ విశ్వవిద్యాలయాలలో ఆంద్ర ఆచార్యుడుగా కూడా పనిచేశారు. "తన ఇల్లే విద్యా కేంద్రంగా తానే మహారాజ పోషకుడుగా వ్యవహరించి ఆంధ్రభాష సాహిత్యాలకు సేవచేసి పండితులను పోషించి సమకాలీనులచే 'నూరార్లు లెక్క సేయక వేమార్లర్ధ మిచ్చు వితరణి' అని కీర్తింపబడ్డాడు బ్రౌన్" అన్న ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారి మాటలు అక్షర సత్యాలు.





సరసభారతి ప్రచురిస్తున్న 8వ పుస్తకం "జనవేమన" లోని వ్యాసాలన్ని "రెడ్డి జ్యోతి" మాస పత్రికలో "రెడ్డి కవులు - దొడ్డ రచనలు" పేరిట దారావాహికంగా ప్రచురింపబడి అందరిని ఆకర్షించాయి. వీటిని పుస్తక రూపంలో తెచ్చి ఉద్దేశ్యాన్ని సంపాదకులైన శ్రీ ఏ.బి.ఆనంద్‌గారికి తెలియచేయగానే వారు పెద్ద మనస్సుతో అంగీకరించి ప్రోత్సహించారు. వారే నన్ను ప్రేరేపించి ఇంత మంచి రచనలు చేయటానికి కారకులైనారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

వేమనను వెలుగులోకి తెచ్చి తెలుగు బాషా సాహిత్యాలకు విస్తృత సేవ చేసిన తెలుగు వారికి నిత్య వ్రాత స్మరణీయుడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌కు "జన వేమన పుస్తకాన్ని సవినయంగా అంకితం ఇస్తున్నాను".

- గబ్బిట దుర్గా ప్రసాద్

# జన వేమన

## " రెడ్డి కవులు – దొడ్డ రచనలు " (విస్మృత రెడ్డి కవులు)

" రెడ్డి " పదం 7వ శతాబ్దంలోనే రెడ్లు వున్నట్లు శాసనాధారాలున్నాయి. క్రీ..శ.632లోని మొదటి విష్ణు వర్ధనుడి చీపురుపల్లి శాసనంలో రాష్ట్రకూట ప్రముఖులుగా వీరిని పేర్కొన్నారు. రాష్ట్రకూటపదమే రెడ్డిగా మారిందంటారు. వీరు సేద్యం చేయటంవల్ల 'పంటరెడ్లు' గా ప్రసిద్ధిచెందారు. కాకతీయుల కాలంనాటికి కాడివీరులు కత్తివీరులయారు. తెనాలి రామలింగడు రెడ్లను 'కాపులు'గా సంబోధించాడు. కడప, నెల్లూరు జిల్లాలలోని రెడ్లను 'కాపులు' అనే పిలుస్తారట. 16వ శతాబ్దంనాటికి రెడ్లలో 14 శాఖలున్నట్లు తెలుస్తోంది. రెడ్డి కులాన్ని 'పంటాన్వయం' అనేవారటకూడ, ఈ శాఖల్లో పంటరెడ్లు ప్రముఖులు. వీళ్ళను దేచట, దేసటి, దేష్టి అని కూడా అనేవారట. కాశీఖండంలో శ్రీనాధుడు వీరభద్రారెడ్డి రాజును " శ్రీమద్దేశటి వంశ శిఖామణి ' అని పిల్చాడు, ఉత్తరాంధ్రలో 'రెడ్డిక' వాళ్ళు వీరిలో వెనుకబడిన రెడ్లుగా భావిస్తారట. అసలు 'రెడ్డి' అంటేనే 'గ్రామపాలకుడు ' అని అర్థం. గ్రామపాలకుడు రచ్చబండ మీద కూర్చొనే చోటును 'రెడ్డిగం' అంటారట. 'పెనుగాము రెడ్డిగంబును మించి ' అని ఉద్భటారాధ్య చరిత్రలో తెనాలి రామకృష్ణ కవివాడాడు. 'ఒక కాలు ముడిచి, దానిపై మడచిన 'యింకో కాలిపాదం మోపి, ఆ కాలిని, వీపును అంగవస్త్రంలో గట్టిగా బిగించి కట్టుకోవడమే 'రెడ్డిగం'. రాజులైన రెడ్లు తండ్రి పేరు తర్వాత తమ పేరు వచ్చేట్లు పెట్టుకొన్నారు. ఇంకా తమాషా యేమిటంటే యింటిపేరు, అసలు పేరు, కులం పేరు కూడా కలిపి 'రెడ్డి రెడ్డి రెడ్డి ' అని పిలిపించుకొనేవారూ వున్నారట. ఇందులో మొదటిది యింటిపేరు, రెండోది పేరులో మొదటిది, చివరి రెడ్డి కులానికి సంబంధించినది. కడప జిల్లా పెదకల్లు ప్రాంతం నుంచి





రెడ్లు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు వ్యాపించినట్లు కనిపిస్తోంది. అందులో ఒకశాఖ 'పెడకంటి రెడ్లు' వీరి భార్యలు తాళిబొట్లు ధరించరట. పెళ్ళిళ్ళలో వధువు మెడలో 'నూలుపోగు' మాత్రమే ధరిస్తారట. 16 రోజుల పండగ తర్వాత దాని బదులు 'బంగారు నాంతాడు ' వేసుకొంటారట. దీనికి పిచ్చుకగుంటల వాళ్ళు చెప్పే ఒక కథ ఆధారం. సీత వనవాసంలో వున్నప్పుడు శ్రీరాముడు యాగం చేయటానికి స్వర్ణసీతను తయారు చేయించటానికి సిద్ధపడి, కోశాగారంలోని బంగారం అంతా వాడినా చాలలేదట. అప్పుడు పెదకంటి రెడ్ల స్త్రీలు తమ నగలతోపాటు తాళిబొట్లు కూడా సమర్పించారట. అప్పుడు త్రాసు మొగ్గుచూపిందట. అప్పటి నుంచి తాళిబొట్లు ధరించే అలవాటుకు స్వస్తి చెప్పారట. ఇలా రెడ్లు వ్యవసాయం, రాజకీయంలో ప్రవేశించి కవితా వ్యవసాయంలోనూ గొప్ప ఫలితాలను సాధించారు. ఆ వైనం ఏమిటో తెలుసుకోవటమే యీ వ్యాసం ఉద్దేశ్యం.

# గోన బుద్ధారెడ్డి

రెడ్డి పేరు వ్యాప్తిలోకి వచ్చిన సుమారు 600 సంవత్సరాల వరకు రెడ్లలో వున్న కవులు, రచయితల పేర్లు యేవీ అందుబాటులో లభించలేదు. వారు వ్రాసిన పద్యాలు, పదాలు కూడా చరిత్రలో స్థానం పొందలేదు. కారణాలు తెలీదు. చరిత్రలో చోటు సంపాదించుకొన్న మొదటి కవి, రాజు గోన బుద్ధారెడ్డి, క్రీ .శ. 1294లో వర్ధమానపురంలో రాజ్యం చేసినట్లు తెలుస్తోంది. ఇతనికి 'కదన ప్రచండ' , 'మీసరగండ ', 'ఉభయబలగండ బిరుదులున్నాయట తండ్రి విఠలరాజు బుద్ధారెడ్డి కాకతీయుల సామంతరాజు. ఇతను 'రంగనాథ రామాయణం' ను ద్విపద కావ్యంగా వ్రాశాడు. తండ్రి విఠలుడే పాండురంగ

వితలుడని, ఆయన పేరుమీదుగా కావ్యాన్ని రంగనాథ (వితల) రామాయణంగా పేరు వచ్చిందని చెప్తారు. తండ్రికీ 'మీసరగండ' బిరుదు వుండేదట. గోనరెడ్డి తన 75 వ యేట కొడుకులైన కాచభూపతి, వితలరాజులను రామాయణంలోని ఉత్తరకాండను వ్రాసి పూర్తి చేయమని కోరాడట. ఇలా దేవుడే కలలో కన్పించి చెప్పాడట. గోనకు 'సర్వజ్ఞ బిరుదు' వుంది. 'కవి సార్వభౌమ ' అనే ఛందస్సును 'కవి వాగ్బంధం' అని కూడా పిలుస్తారు. వాల్మీకి రామాయణంలో లేని ఎన్నో కథలను కల్పించి, జనరంజకంగా రాశాడు గోన బుద్ధారెడ్డి. పదాలు, అర్థాలు, భావాలు, గతులు, పదశయ్యలు, అర్థ సౌభాగ్యాలు, యతులు, రసాలు, గుంభనలు, ప్రాస సంగతులతో గొప్పగా వుండే కావ్యం రంగనాథ రామాయణం ' అని విమర్శకులు మెచ్చిన కావ్యమది. ఇతని కొడుకులు పురాణజ్ఞులు, బహుకళాద్యుతులు, కవిరాజ భోజులు "గా ప్రసిద్ధులు. కనుకనే తండ్రి కోరికపై ఉత్తర కాండనూ వ్రాసి "తొలి జంట కవులు " గా పేరు పొందారు. కాచ భూపతి, వితలరాజు. తండ్రి తగ్గ తనయులని పించుకొన్నారు. మనకు ఆది కావ్యం వాల్మీకి రామాయణం. అదే రెడ్డి కవులూ తమ ఆది కావ్యంగా చేసి చరితార్థులయారు. ఇంక ఆ సాహితీలహరి అవిచ్ఛింగా కొనసాగింది. పాడుకోవటానికి వీలుగా వుండటంతో రంగనాథ రామాయణం బాగా ప్రాచుర్యమైంది.

## రెడ్డిరాజ్య స్థాపన

క్రీ .శ. 1325లో పెద కోమటి వేమారెడ్డి రెడ్డిరాజ్య స్థాపన చేశాడు. కొమర గిరిరెడ్డి, కాటయ వేముడు, అన పోతారెడ్డి, అన వేమారెడ్డి వగైరాలు రెడ్డి రాజుల్లో పేరెన్నికగన్నవాళ్ళు. సుమారు 100 సంవత్సరాలు రెడ్డి రాజులు





పరిపాలించారు. వీరంతా సంస్కృతంలో గ్రంథాలు రచించారు. తెలుగునూ ఆదరించారు. లక్షణంతో సమన్వయం చేసే కావ్యాలు వీరితోనే ప్రారంభమయాయి. పంటలు పండించే రెడ్లు కవితా ఫలసాయమూ తీసి భేష్ అనిపించుకొన్నారు. కావ్య కర్తలే కాదు, కావ్యభర్తలూ అయారు. రాచవేమారెడ్డితో రెడ్డిరాజ్యం అంతరించింది. పద్మ నాయక రాజులు తెలంగాణా ప్రాంతాన్ని పాలించే రోజుల్లో రెడ్డి రాజులు ఆంధ్ర ప్రాంతాన్ని పాలించారు. అద్దంకి, కొండవీడు, రాజమండ్రి రాజధానులుగా రెడ్లు పరిపాలించారు. ఎఱ్ఱన, శ్రీనాథుడు, రాయనిబాచడు మొదలైన కవులకు ఆశ్రయం కల్పించి, గ్రంథ రచనలు చేయించి ప్రోత్సహించారు. సంగీతానికి, నాట్యానికి సమానస్థాయినిచ్చారు. ధర్మకార్యాలు చేశారు. వసంతోత్సవాలు నిర్వహించారు. ఆ రోజుల్లో సంగీత, సాహిత్య, నాట్య సరస్వతులు అవధులు లేని ఆనందాన్ని అనుభవించారు. కళలకు కాణా బిగారెడ్డిరాజులు పాలన చేశారు. ప్రజారంజన వారి మొదటి కర్తవ్యం. ఆ వివరాలు తెలుసుకొందాం.

## పెదకోమటి వేమారెడ్డి

'పల్లవ త్రినేత్రుడు ' అనేబిరుదున్న వేమారెడ్డి రెడ్డి రాజ్యాన్ని సర్వోన్నత స్థితికి తెచ్చాడు. అద్దంకి, కొండవీడు, కొండపల్లి, ధాన్యవాటిలో దుర్గాలు నిర్మించి రాజ్యాన్ని పటిష్టం చేశాడు. వేగి, వెలనాటి, ద్రావిడ బ్రాహ్మణులకు 36 అగ్రహారాలు దానం చేసిన మహాదాత. శ్రీశైలానికి, అహోబిలానికి సోపాన పంక్తులు నిర్మించాడు. ఇవన్నీ శాసనాలలో సాక్ష్యం గా నిలుస్తాయి. ఈతని ప్రేరణలోనే ఎల్లాప్రగడ హరివంశం, రామకథ వ్రాశాడని చెప్తారు. ఇతనికి ' సర్వజ్ఞ చక్రవర్తి ' ' వీరనారాయణ ' బిరుదులూ వున్నాయి. తమ్ముడు మాచారెడ్డిని

కొండపల్లి రాజును చేశాడు. వేమారెడ్డికి సంగీతంలో మంచి ప్రవేశం వుంది. ' సాహిత్య చింతామణి ' అనే గ్రంధం వ్రాశాడు. ఇది తిరువనంతపురం లైబ్రరీలో లభిస్తుంది. రావిపాటి త్రిపురాంతక కవి వ్రాసిన ' ప్రేమాభిరామం' అనే వీధి నాటకం నుంచి ఒక శ్లోకాన్ని గ్రహించి 'సాహిత్య చింతామణి ' లో వాడాడట. ఇది అలంకార శా స్త్రం, సంస్కృత రచన. 'సంగీత చింతామణి ' అనే గాంధర్వ విద్యా శాస్త్రము వ్రాశాడట. గాధా సప్తశతికి వివరణగా 'సప్తశతీ సారాణిక వ్రాశాడు. అమరుక శతకానికి శృంగార దీపిక వ్యాఖ్యనూ వ్రాశాడు. ఈయన చందవోలు రాజుగా వున్నప్పుడు జశ్రీనాధుడు వచ్చినట్లు కన్పిస్తోంది. వేమారెడ్డి కీర్తిలత శ్రీశైలంలో స్తిర మూలమై కుమారాచలంలో వృద్ధి చెంది, పంచారామాలలో, సింహాచలంలో పందిళ్ళు అల్లి, శ్రీకూర్మం, పురుషోత్తమాలలో పుష్పించి, కాశీలో విశ్వనాధునికి నిత్యనైవేద్యానికి ఫలించింది' అని శ్రీనాధుడు వ్రాశాడు. ఈ శ్లోకం ఫిరంగిపురం శాసనంపై వుంది. శ్రీనాధుడు విద్యాధికారి కనుక శాసన కర్త కూడా ఆయనే. శ్రీనాధుని " విద్యాధికారీ శ్రీనాధోవీర శ్రీవేమ భూపతే : అని చెప్పుకొనేవారు. ' శ్రితపోషణ, రిపు శోషణ, బుధ తోషణ, సత్యభాషాది గుణాన్, దధతే దశరధ రామ: ప్రాగద్య కలౌతు కోమటి విభువేమ : " అని కీర్తింపబడిన రాజు కాశీ రామేశ్వరాలనూ సందర్శించిన సాక్ష్యాలున్నాయి. ' సముద రిపు వీరరాజ వేశ్యాభుజంగ అతులబలభీమ, పెదకోమటన్నవేమ, అని ప్రస్తుతింపబడ్డాడు. కొండవీడు "ముగురు రాజులకును, మోహంబు గలిగించు కొమర మించిన వీడు'గా కీర్తి పొందింది. 20 సంవత్సరాలు పాలించాడు. క్రీ.శ. 1400 లో రాజ్యానికి వచ్చి 1420 లో చనిపోయాడు. చివరి కాలంలో గజపతులు, విద్యానగరరాజు, రాజమహేంద్ర రెడ్డి రాజులు, వెలుగోటి వెలమరాజులు చుట్టు ముట్టారు. మాచర్ల వెలమరాజు వెలుగోటి మాదయ లింగమనేడు – వేమారెడ్డిని ఓడించి ' సందికంత పోత రాజు ' అనే





కటారిని తీసుకొని పోయాడట. అతని బొమ్మను తన ఎడమకాలి గండ పెండేరానికి కట్టుకొన్నాడట. శ్రీనాథ కవి సార్వభౌముడు లింగమనేని ని అర్జించి కటారిని తెచ్చి వేమ భూపతికి యిచ్చి రాజురుణం తీర్చుకున్నాడట. 1417 లో పెదకోమటి, ఫిరోజ్ షాతో కలిసి రాజమహేంద్రంపై దండయాత్ర చేశాడు. దీనికి ప్రతీకారంగానే లింగమనీడు ఆ పని చేసినట్లు కధనం.

వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి ఎర్రన కవిని ఆదరించి అన్నగారైన వేమారెడ్డి దగ్గరకు చేర్చాడు. వేమారెడ్డి చదలవాడకు వచ్చి తమ్ముడు కట్టించిన రామాలయానికి ఒక అగ్రహారాన్ని చంద్రగ్రహణం రోజున, గుండ్లకమ్మ నదిలో యిసుక తిన్నెపై కూర్చుని దానం చేసినట్లు శాసనం ఉంది. ఆ వూరే తర్వాత మల్లవరం అయిందట. ఎర్రన గార్ని మల్లారెడ్డి రామాయణం వ్రాయమని కోరితే వ్రాసాడట. అయితే శిధిలమై 28 పద్యాలే దొరికినాయట. ఈ రామాయణం వల్ల తనకు గొప్ప కీర్తి వచ్చిందని వేమారెడ్డి చెపఙ్పుకున్నాడట. ఆయనే ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసు అయిన ఎఱ్ఱా ప్రగడ కవిని 'హరివంశం' వ్రాయమని అర్ధించాడట. హరివంశం కలిస్తేనే భారతం 'మహా భారతం' అవుతుందని చెప్పాడు.అలానే వ్రాసి కీర్తి పొందాడు. నేపాల్ దేశంలో 'హరి వంశం' ను నెత్తిన పెట్టుకొని న్యాయస్థానంలో సాక్షులు ప్రమాణం చేస్తారట. వేమారెడ్డి 'వీర నారాయణ చరిత్ర' అనే భాణము కూడా వ్రాసాడు. ఇతని కాలంలో శైవ, వైష్ణవ గ్రంధాలు సమానంగా ఆదరింపబడ్డాయి. హరిహర సమన్వయమూ లభించింది. ముఖ్యంగా ద్విపద చాలా ప్రజాదరణ పొందింది.

## అనపోతారెడ్డి – అన వేమారెడ్డి

అనపోతారెడ్డి 1366 వరకు రాజ్యం చేశాడు. అమరావతిలో తన మంత్రి 'అల్లయ వేమన' తో అమరేశ్వరుని పున: ప్రతిష్ట చేయించాడు. అన

వేమారెడ్డి ధార్మికుడు. ధర్మ వేమన బిరుదున్నవాడు. షట్కాల శివ పూజా దురంధరుడు. సంతాన సాగరం మొదలైన తటాకాలు నిర్మించాడు.ఇతని కాలంలో ఎలకూచి బాల సరస్వతి కవి విద్యాధికారిగా వుండేవాడట. క్రీ.శ. 1381 వరకు పాలించాడు. 1427-48 కాలంలో వీరభద్రారెడ్డి పాలించాడు. శ్రీనాధుడు కాశీ ఖండం వ్రాసి అంకితమిచ్చాడు. వీరభద్రారెడ్డి మంత్రి అన్నయ్యకు భీమఖండం రాసి అంకితమిచ్చాడు.

## కాటయ వేమారెడ్డి

అద్దంకి రాజధానిగా, తన బావ కొమరగిరిరెడ్డిని రాజుగా చేసి కాటయ వేముడు పాలించాడు. ( క్రీ.శ.1364-1386). బావ కొమరగిరి పేటలో 'కుమర గిరి రాజీయం' ను మహాకవి కాళిదాసు వ్రాసిన నాటక త్రయానికి వ్యాఖ్యానం వ్రాశాడు. కాటయ శూరుడు,విద్వద్గోష్టీ ప్రియుడుగా ప్రసిద్ధుడు. ఇతని కాలంలో రాయన భాస్కరుడు మంత్రిగా వున్నట్లు ఓ చాటువు వుంది.

" కలయ బసిండి గంటమున గాటయ వేమ సమక్షమందు, స
త్ఫలముగ " రాయన ప్రభుని బాచడు" వ్రాసిన వ్రాల మ్రోతలున్
గలు గలు గల్లు గల్లురన గంటక మంత్రుల గుండె లన్నియున్
జలు జలు జల్లు జల్లురను సత్కవి వర్యులు మేలు మేలనన్ "

ఈతని శాసనాలు పిఠాపురం, పెద్దాపురంలో వున్నట్లు తెలుస్తోంది. క్రీ.శ. 1416లో మరణించాడు. బావ గారిని గద్దెపై కూర్చోబెట్టి రాజ్య పాలన సక్రమంగా నిర్వహిస్తూ, కొమరగిరి కీర్తిని గిరి శిఖరాల చేర్చి, సంగీత, సాహిత్య నాట్య వైభవానికి అగణిత కీర్తి తెచ్చినవాడు కాటయ వేమారెడ్డి. అధికార దుర్వినియోగం చేయకుండా రాజ ప్రతినిధిగా విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చిన రచయిత, రాజు.





## కొమరిగిరి రెడ్డి

బావమరిది అండదండగా వుండగా కొమరిగిరి రెడ్డి హాయిగా, చీకూ చింతా లేకుండా వైభవంగా రాజ్యపాలన చేశాడు. కవి పండితులను, సంగీత, నాట్య కోవిదుల్ని పోషించాడు. 'వసంత రాజీయం ' పేరుతో నాట్య శాస్త్ర గ్రంధాన్ని సంస్కృతంలో రచించాడు. శాకుంతల వ్యాఖ్యలో దీన్ని గురించి గొప్ప ప్రశంసవుంది.

"మునీనాం భరతాదీనాం, భోజాదీనాం చభూభుజం
శాస్త్రాణి సమ్యగలోచ్య నాట్య వేదార్ధ వేదినాం
ప్రోక్తం "వసంతరాజేన " కుమారగిరి భూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్య శాస్త్ర యదుత్తమం "

ఇతని ఆస్థానంలో 'లకుమ' అనే నాట్యకళాకారిణి వుండేదట. ఆమె ఆయనకు వేశ్య అనీ అంటారు. ఒక్క భావానికి వెయ్యి రకాల అభినయం చేసి చూపేదట. ఆ విషయం కూడ ఒక శ్లోకంలో గొప్పగా వర్ణించబడి వుంది.

'జయతి మహిమాలోకతీత : కుమరగిరి ప్రభో
స్సదసి ' లకుమాదేవీ ' యస్యప్రియ సదృశీ ప్రియా
నవ మభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహునర్ధానర్థి వ్రజాయ సహస్రశ : "

కుమర గిరి కాలంలో వసంతోత్సవాలు నభూతో గా జరిగేవట. అందుకే అతన్ని 'వసంత రాయలు ' అనేవారట. దాదాపు ఇతనితో రెడ్డి రాజ్య ప్రభ అంతరించినట్లే.

# రెడ్డిరాజ్య పతనం

పెదకోమటి వేమారెడ్డి కొడుకు తండ్రి తర్వాత రాజ్యానికి వచ్చి 4 ఏళ్ళు పాలించాడు. కర్కోటకుడు, దుష్టుడు, వురిటి మంచం మీద కూడా పన్ను వేసిన ఘనుడు. ఇతని బాధలు భరించలేక సవరం ఎల్లయ్య అనే బలిజ నాయకుడు యితన్ని పొడిచి చంపేశాడట. 1424 – 48 కాలంలో పాలించిన వీరభద్రారెడ్డి రాజమండ్రి నేలిన వారిలో చివరివాడు. 1424లో కొండవీటి రెడ్డిరాజ్యం అస్తమించింది. అప్పుడు విజయనగరంలో మైలారెడ్డి ప్రముఖుడు. ఇతడు శ్రీనాధకవి సార్వభౌముని ఆదరించి చేరదీశాడు. దిన వెచ్చ మిచ్చి పోషించాడు. కొండవీడు అందరిదీ అయింది. ఎవరెప్పుడు వచ్చి, ఏలి సోలిపోయారో తెలీదు. దీనినే శ్రీనాధుడు 'పాములకు ఎన్ని కన్నాలో। పక్షులకెన్ని ఆశ్రయ వృక్షాలో, ఏటికి అలుగులెన్నో, ఎలుగుబంటికి ఎన్ని వెంట్రుకలో కొండవీటిలో ఏలికలు అందరు అని చమత్కరించాడు. అంతేకాదు రెడ్డిరాజుల కీర్తినీ అద్భుతంగా ప్రశంశించాడు చూడండి. ఒక్క పద్యంలో ఆ వైభవ మంతా కనుల ముందు కన్పించి ఆనంద పరవశుల్ని చేస్తుంది.

"మహనీయంబుగ నంధ్రభూవలయముం బాలించు చుం బ్రాజ్ఞులై
బహుకార్యంబులు చెప్పుచున్, మరియు జెప్పంజేయు చాముష్మిక
స్పృహలో ధర్మము లాచరించుచు జగజ్జేగీయ మానంబుగా
నహముల్ పుచ్చిన రెడ్డిరాజుల సముద్యత్కీర్తి గీర్తించెదన్ "

ఇలా ఒక స్వర్ణయుగం దాటి వెళ్ళిపోయింది.





# తెలంగాణ కవులు

వీరి తర్వాత గుర్తుంచుకోదగిన కవిత్వం వ్రాసిన వారు తెలంగాణ రెడ్డి కవులు. అందులో ఒకరు క్రీ . శ. 1550 – 1600 వరకు వున్న కామినేని ఎల్లారెడ్డి. నిజాం రాష్ట్రంలో మెదక్ జిల్లా బిక్కనవోలు నివాసి. ఇతని సోదరుడు దోమకొండ సంస్థానాధిపతి మల్లారెడ్డి. 'లింగపురాణం ' "వాశిష్టం " గ్రంధాలు రచించినట్లు తెలుస్తోంది. అవి అలభ్యం. సోమనాధ కవి వ్రాసిన 'బ్రహ్మోత్తర ఖండ ' కావ్యాన్ని అంకితమూ పొందాడట. అది యీ కవి ప్రత్యేకత. కావ్య కర్తా, భర్తా కూడానన్నమాట. ఇతని తర్వాత గుర్తుంచుకోతగినవాడు తూము పరశు రామిరెడ్డి. మహబూబ్ నగర్ జిల్లా వాడు. మామిడి మడ కాపురస్తుడు. 'అలమేలు మంగా పరిణయం ' అనే ప్రబంధం రచించినట్లు గోల్కొండ కవుల సంచికలో వుంది. 16వ శతాబ్ది మొదటి భాగంలో వున్న మల్లారెడ్డి దేశాయి కవి 'గంగా పుర మాహాత్యం ' ప్రబంధం రాశాడట. ఈ గ్రామం హైదరాబాద్ ప్రాంతానిదే. దీనికి 1500 సంవత్సరాల చరిత్ర వుందట. అసలు పేరు రామయాపురం అని, పశ్చిమ చాళుక్యుల శాసనాలలో ఆ పేరు కన్పిస్తుందని ఆరుద్ర అన్నారు. స్కాంధ పురాణాంతర్గత తీర్ధ ఖండంలో యీ మహాత్యం వుందని కవి చెప్పాడు. ఈ కవిని 'రెడ్డెడ్డి ' అని కూడా అంటారట. అలాగే హైదరాబాద్ రాష్ట్రంలోని దమ్మారావుపేట నివాసి చేద రాఘువరెడ్డి ' వెంకటరమణా ' మకుటంతో కంద పద్య శతకం వ్రాశాడు. 'విష్ణు సర్వోత్తమా' మకుటంలో మరో శతకమూ వ్రాశాడట. ద్విపద కావ్యంగా రామాయణం వ్రాశాడట. కాచరాజు కుమారుడు 'మల్లారెడ్డి ' గోల్కొండ నవాబు మల్కిభరాం కాలంవాడు. బిక్కనవోలు రాజు. 'షట్చక్రవర్తి చరిత్ర, పద్మపురాణం, శివధరోత్తర ఖండం వ్రాశాడు. ఇందులో మొదటిది చాలా ప్రశిద్ధి చెందినదిగా చెప్తారు. 8 ఆశ్వాసీలు – 6 గురు చక్రవర్తుల కథ లక్షణంగా, రసవంతంగా వుండే కవిత్వమని పండితాభిప్రాయం.

# వేమన

ఆట వెలదిని ఆయుధంగా మూఢ విశ్వాసాలను త్రుంచిన వేమారెడ్డి అనే వేమన క్రీ . శ. 1640 – 1725 ప్రాంతంవాడు. ఆయన కవిత్వం విశ్వజనీనం. ఆయనకు కులం, మతం, ప్రాంతం అంట గట్టలేం. 'విశ్వకవి ' గా విఖ్యాతుడు. ఆయన పద్యం రాని తెలుగు వాడుండడు. నాదృష్టిలో వేమన 'అంటే " వేయి విధాల మన వాడు " ఆయన చెప్పిందంతా వేమన వేదమే. సహజకవి ఆత్మశ్రయ కవిత్వం. తానే గురువు, తానే శిష్యుడు. యోగి వేమనగా ఆరాధ్యుడు. ప్రజాకవి, మహాకవి, విశ్వకవి. తత్వంలాగపాడి అందుబాటులోకి తెచ్చాడు. ప్రభోధం, సంస్కారం ఆయన పద్య లక్షణం. ఆత్మోద్ధరణ, సమాజోద్ధరణ ధ్యేయం. మానవుడే మాధవుడన్న జ్ఞానయోగి. సహజ సంప్రదాయ కవి. ఆయన్ను అద్వైతిగా, శైవునిగా, జైనుడుగా, చార్వాకుడుగా ఎవరిష్టం వచ్చినట్లువారు పిల్చుకొని తమ వాణ్ణి చేసుకొన్నారు. ప్రాత : స్మరణీయుడు, చిరస్మరణీయుడు వేమన.

ఇంతమంది కవులను గూర్చి చెప్పుకున్నాం. ఒక్క వేమన తప్ప మిగిలిన వారంతా 'విస్మృత కవులు ' జాబితాలో చేరటం మనదురదృష్టం. సాహిత్సంపై మనకున్న అలసత్వానికి ప్రతీక. కనీసం ఒక్కసారైనా వారిని స్మరించాలని చేసిన ప్రయత్నమే యీ వ్యాసం.

# వేమన సూర్యోదయం

దాదాపు 16వ శతాబ్దం చివరి వరకు రెడ్డిరాజు లే కవులు. సంస్కృత గ్రంథాలే ఎక్కువగా వ్రాశారు. శాస్త్ర గ్రంథాలు, అలంకార శాస్త్రాలు, సంగీత శాస్త్ర గ్రంధాలపై దృష్టి కేంద్రీకరించారు. కాకపోతే దైవాల చరిత్ర, వారిపై శతకాలు వ్రాసి తమ భక్తిని చాటుకొన్నారు. ఆకవిత్వమంతా రాజాస్థానాలకు,





పండితులకే పరిమితమై పోయింది. సామాన్య ప్రజల జీవనస్థితి గతుల గురించి యెవరికీ పట్టలేదు. ప్రజల అజ్ఞానాన్ని పారద్రోలి వారి చీకటి బ్రతుకులలో జ్ఞాన సూర్యుల్ని వెలిగించిన వారు లేరు. వారి మూఢ భావాలను మాన్పించే ప్రయత్నం చేసిన వారు లేరు. కర్తవ్యబోధ చేసి కార్యోన్ముఖుల్ని చేసిన వారే కన్పించ లేదు. ప్రజల యొక్క ప్రజల చేత, ప్రజల కొరకు కవిత్వం రాలేదు. సామాన్యుని మాన్యునిగా మార్చే కవితా ప్రక్రియ లేదు. సంస్కృత ఛందస్సే వేదం అయింది కవులకు. అదిగో, అలాంటి అవసర సందర్భంగా వేమన గారు ఒక ప్రచండ భానుడిలా అవతరించారు. ప్రజల కోసం కవిత్వం చెప్పారు. ప్రజల భాషలో చెప్పారు. ప్రజల పలుకుబడులను వుపయోగించారు. మార్మికత లేకుండా సూటిగా గుండెల్ని తాకేటట్లు కవిత్వాన్ని వ్రాశారు. ప్రజా కవి అయినారు. భావనలన్నీ విశ్వ వ్యాపితమవటంలో విశ్వకవి అన్న ప్రసిద్ధి పొందారు. అలవోకగా చెప్తూనే, జీవిత రహస్యాలను, ఆధ్యాత్మిక చింతనను రగిల్చారు. జ్ఞానదృష్టి ప్రసాదించి, జ్ఞాన యోగి గా మారారు. ఏ ఆట వెలది కోసం తన జీవిత సర్వస్వాన్ని కోల్పోయారో, విరాగిగా మారారో, ఆ ఆటవెలది అనే అచ్చ తెలుగు ఛందస్సును ఆధారం చేసుకొని 'విశ్వదాభిరామ వినురవేమ ' అన్న మకుటంలో, తెలుగు కవి ప్రపంచంలో గొప్ప శతక కర్త అయ్యారు. ఆయన పద్యాలన్ని వాచోవిధేయాలైనాయి. అవసరం, సందర్భం వచ్చినపుడు ఉపయోగించే ఉదాహరణలైనాయి. తెలుగు కవిత్వం కొత్త వెలుగులు సంతరించుకొంది. తెలుగు ప్రజలను వేమన ఆశాజ్యోతి అయ్యారు. ఆత్మాశ్రయంగా, తత్వాలుగా, ఆయన చెప్పిందంతా ' వేదం ' గా భాసించి ' వేమన్న వేదం ' అయింది. తెలుగువారికి నిత్య ప్రాతస్మరణీయుడయాడు వేమన. మరి అంతటి ప్రభావాన్ని చూపించి, చైతన్య స్ఫూర్తిని కల్గించిన ఆ మహానుభావుని చరిత్ర తెలుసుకొని ధన్యులమవుదాం.

## "బ్రౌన్ కనుగొన్న వేమన "

ఇంత ఘన చరిత్ర కలిగిన వేమన్నను మన లాక్షణికులు గుర్తించనేలేదు. లక్షన గ్రంథాలలో, చివరికి కవుల చరిత్రలోనూ స్థానాన్నివ్వలేదు. ఆంగ్లాధికారి యైనా, తెలుగుదేశంపై అభిమానం, తెలుగు సారస్వతంపై అభిరుచి వున్న " ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ " వేమన పద్యాలను సేకరించి శుద్ధపరిచి తెలుగువారికి పరిచయం చేశాడు.బ్రౌన్ చేయకపోతే, వేమన్న యెప్పటికీ అలా చరిత్ర పుటలకెక్క కుండా వుండిపోయేవాడు. అందుకే బ్రౌన్ మనకు చిరస్మరణీయుడైనాడు. ఆ తర్వాత వేమన కవిత్వంపై శ్రీరాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, శ్రీ మరుపూరి కోదండరామిరెడ్డి గార్లు దృష్టి సారించి, ఆయన కవిత్వంలోని లోతు పాతులను ప్రజలకు అందించారు. దానిలో వేమన కీర్తి దిశలకు చేరింది. అంతా వేమనను మనవాడే అన్నారు. ఆయన భావాలను తనివి తీర గ్రోలారు. బ్రహ్మరథం పట్టారు. నీరాజనాలందించారు. మనిషే దేవుడని, మానవతావాదమే ఆయన మతమని గ్రహించారు.

క్రీ . శ. 1640 ప్రాంతంలో రాయలసీమలోని రెడ్డి కులంలో జన్మించాడు వేమన. రాజభోగం వున్న వంశం. ఆయన గురువు శివయోగి. స్నేహితుడు అభిరామయ్య - బంగారు నగలు చేసేవాడు. అభి రామయ్యను మోసంచేసి గురువువద్ద ఉపదేశంపొంది, బీజాక్షరాలు రాయించుకొన్నాడని కథ ప్రచారంలో వుంది. దాని ఫలితాన్ని దక్కించుకున్నాడు. అభిరాముడికి దక్కాల్సిన ఫలితాన్ని తాను చేజిక్కించుకొన్నానని చాలా బాధపడ్డాడు. అతని కీర్తి శాశ్వతం కావాలి అని భావించి ' విశ్వధాభిరామ వినుమరేమ ' అన్నీ మకుటంలో ఆటవెలది పద్యాలు చెప్పాడు. దీని అర్థం, 'విశ్వాన్ని (సమస్తాన్ని) యిచ్చే దేవుడికి యిష్టమైనదిగా అని ఇవన్నీ ఒక రోజులో చెప్పినవి కావు. ప్రదేశాలు తిరుగుతు,





చూచిన విషయాలపై స్పందిస్తూ సంఘంలోని చెడును, కుళ్ళును, అవినీతిని చూసి ఆగ్రహిస్తూ బాధపడ్తు, మార్పు రావాలని కోరుతూ చెప్పిన పద్యాలవి, ముక్తకాలు. ఆ పద్యాలు ప్రజల నాల్కలపై జీవించాయి. వేదంలా, తరతరాలకు ప్రాప్తించాయి. వానలో తడియనివారు, వేమన పద్య మరందభారలో తనియని వారులేరు. గ్రామీణ జీవితానికి అద్దం పట్టాడు. ఆయన పద్యాలలో ఆనాటి సమాజపు పోకడలన్నీ కన్పిస్తాయి. ఒక విధంగా సమకాలీనచరిత్రను పద్యాలలో బంధించాడనవచ్చు. చివరకు సర్వం త్యజించి సన్యాసి అయ్యాడు. ఆత్మజ్ఞానంతో యోగి వేమనగా మారాడు. ప్రతిదాన్ని ప్రశ్నించటం నేర్పించాడు హేతువాదిలా. అస్పృశ్యతను నిరశించాడు, సమాన గౌరవం సంఘంలో అందరికీ వుండాలి అని సంఘసంస్కర్తగా చెప్పాడు. విరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారు కాలజ్ఞానం ' వ్రాశారు. ఆయనే " వేమన్న మా అన్న " అని ఆత్మీయంగా పిలిచారు. ప్రజలకు శాస్త్రీయ థృక్పథం కల్గించిన మొదటి కవి వేమన. ఆయన వేసిన ప్రతి అడుగు భావితరాలకు బాట. ఆయన చెప్పిన ప్రతిమాట నీతి ముత్యాలమూట. 'సాను జాతమయ్యే సకలకులము ' అంటే ఒకే కులంలోంచి అన్నీ పుట్టాయి అని చెప్పాడు. కులం పోరు జాతి ఐక్యతకు చేటు అని అర్థం. ఈ స్ఫూర్తితోనే బ్రహ్మనాయుడు చాపకూడు పెట్టించాడు. గురునానక్ 'లంగరు ' అనే సహపంక్తి జభోజనం ఏర్పాటు చేశాడు. " ఉర్వినెల్ల నొక్క కంచము బెట్టి / పొత్తు గుడిపి కులము పోలజేయి ' అన్న సంస్కర్త.

## "బతుకులో ఈ దిన పద్యాలు "

మకుటాన్ని వదిలేస్తే మిగిలిన మూడు పాదాల్లోనే చెప్పదలచుకొన్న మొత్తం భావాన్ని చెప్పాడు. ఆయన భాష ప్రజలది. వాడుకలో వున్న మాటల్నే వుపయోగించాడు. మాండలేకాలకు పెద్దపీట వేశాడు. సూటిగా, సంక్షిప్తంగా

చెప్పాడు. జీవితంలోంచే ఉపమానాలను ఎన్నుకున్నాడు. కుటుంబ వ్యవస్థను కోరాడు. మంచి గుణం వున్న భార్య వుంటే యిల్లే స్వర్గసీమ అవుతుందన్నాడు. భౌతిక సుఖజీవనం, స్వర్గం కంటె ఎక్కువ అని చెప్పాడు. "సుగుణ వంతురాలు సుదతియై యుండిన / స్వర్గమేటి కయ్య, సంసారికంకను " అని వ్యంగ్య వైభవం వింగడించాడు. ఇంటికి దీపం ఇల్లాలే నంటూ 'దేవి యున్న యిల్లు దేవార్చన గృహంబు ' అని కీర్తించాడు. స్త్రీ విద్య చాలా అవసరం అన్నాడు. – "స్త్రీలకే ల విద్య బాలురకే గాని / యనెడి మాటలోక మరసికాదు / ఆలు, మగని కెన్న నర్థాంగి యౌగాదె " అని ఖచ్చితంగా చెప్పాడు. ఈ విధంగా మహిళాభ్యున్నతిని ఆనాడే కోరిన మాననీయ మూర్తి వేమన.

డబ్బున్న వాడికి పిల్లనిచ్చి పెళ్ళి చేస్తే అమ్ము కొన్నట్లే అవుతుందని, సమానమైన వాళ్ళలోనే వియ్యం మంచిదని హితవు చెప్పాడు. పేదలకు యిస్తే, బంధం పెరుగుతుందని, వాళ్ళకు కష్టాలు, సుఖాలు తెలుసుకనున కాపురం స్వర్ణ గోపురం అవుతుందని చెప్పాడు. "కమిలి జూచి యివ్వ శ్రయ మిచ్చినట్లుండు / సమున కివ్వ మంచి సరసగుణము / పేద కివ్వమనువు పెన వేసినట్లుండు అన్నాడు. కానీ యీనాటికీ ఆయన మాట వినేవాడు లేడు. హోదా, డబ్బు, ఉద్యోగం వున్నవారికే పిల్లనిస్తున్నాం. కుటుంబ వ్యవస్థ భద్రతకు చిహ్నం అన్నాడు. అబద్ధాలలో కొపలు కూల్చేవాడి కంటే కల్లుతాగే వాడేనయం అంటాడు. పొదుపుగా మాట్లాడాలి. మాటవల్ల అయ్యేగాయాన్ని మాన్చలేం. 'ఇనుము విరిగె నేని, ఇనుమారు ముమ్మారు / కాచి యతుకవచ్చు కమ్మరీడు / మనసు విరిగెనేని, మరియంట నేర్చునా ? " అని ప్రశ్నించి శోధిస్తాడు. రంగు, కులం బట్టి కాకుండా మనసును బట్టి విలువ నివ్వాలన్నాడు. 'మిరపగింజ చూడ మీద నల్లగ నుండు / కొరికి చూడ లోన చురుకు మనును / సజ్జ నులను వారి సార మిట్టుల నుండు ' అని పోలుస్తాడు. తెలివి తేటలు యెవరి దగ్గరవున్నా





గౌరవించాలి. "పిన్న చేతి దివ్వె పెద్దగా వెలగదా ? అని పోలిక చెప్తాడు. శ్రమలోంచే అన్నీ రావాలి – 'శ్రీమయేవ జయతే ' అన్న భావాన్ని "భూమిలోన పుట్టు భూసార మెల్లను / తనువులోన పుట్టు తత్వమెల్ల / శ్రమములోన పుట్టు సర్వము తానేను / పద్యంలో వివరించాడు.

సులభంగా రాత్రికి రాత్రే ధనవంతులవాలన్న దురాశ పనికి రాదు. కనీస అవసరం అన్నీ వున్నా కరువు వస్తూనే వుంది. దీనికి పేరాశే కారణం అంటాడు. "ఉప్పు, చింతపండు, ఊరిలో నుండగా! కరువదేల వచ్చె కాపులార ! తారకంబెరుగరో, తగరంబునెరుగరో! అని సుద్ది చెప్పాడు. 'తారకం' అంటే ఆర్సెనిక్ సల్ఫైడ్, 'తగరం' అంటే 'TIN' (తుత్తునాగం) ఈ రెండు కలిపితే బంగారం వస్తుందని 'రసవాదం'. ఆయనా ఆ మత్తులో చెయ్యికాల్చుకొన్నారు. అదే 'Alchemy' జ్ఞానోదయం అయితేనేగా యెవరైనా యితరులకు చెప్పేది! వేమనా అంతే.తేనెటీగ మన ఆదర్శం కావాలి. కూడబెట్టిన తేనె యితరులకిచ్చే ఔదార్యం దానికి వుంది. ధనానికి మనం ట్రస్టీగా వుండాలి. గాంధీగారు కూడా తాతా, బిర్లాలను ఇలాగే వుండమన్నారు. 'ధనము కూడబెట్టి, ధర్మంబు సేయక । తాను దినక లెస్స దాచుగాక । తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా ।" అని బోధిస్తాడు. అప్పు చేసి పప్పుకూడు వద్దన్నాడు. తిండి లేకపోతే చదువురాదు. 'గ్రాసమింతలేక కడు కష్ట పడుచున్న । విద్య యేల నిలుచు వెడలుగాని । పచ్చి కుండ నీళ్ళు పట్టిన నిలుచునా?" అని సార్ధకంగా చెప్పాడు. దీన్ని ఆధారంగానే మన ప్రభుత్వాలు మధ్యాహ్న భోజన పధకాలు, సంక్షేమ హాస్టళ్ళు ప్రారంభించాయి. చిత్త శుద్ధి లేకుండా శివపూజ వద్దని" , ఎదుటివారి సొమ్ము ఎల్లరికి తీపి అని", కూడు గుడ్డ తాను కోరునా దేవుడు?" అని ఎన్నో నీతులు, సుద్దులు, బుద్దులు చెప్పాడు. అనుభవసారాన్ని కరతలామలకంగా అందించాడు వేమన. భౌతికంగా 1725లో మరణించాడు.

# చిరంజీవి వేమన్న

వేమన్న శ్రీ రామకృష్ణ పరమహంస అవతారం అని కొందరంటే, కార్ల్‌మార్క్స్ ప్రతి రూపమే వేమన్న అని కొందరంటారు. నాలుగు వందల యేళ్ళు దాటినా వేమన ప్రభావం మన మీద అంత గొప్పగా వుంది. నిత్య కవి, సత్య కవి, చిరంజీవి అయాడు. ప్రజా హృదయల్లో సుస్థిర స్థానం సంపాదించాడు. చెరగని ముద్ర వేశాడు. ఆ మహామహుని నిత్యం స్మరిస్తూనే వున్నారు ఆంధ్ర మహాజనం. వేమన త్రిశత జయంతి జరుపుకున్నారు. తెనాలి దగ్గర మోదుకూరులో 1929 నుంచి శ్రీ మొవ్వ శ్రీనివాసరెడ్డి వేమన జయంతి జరుపుతున్నారు. తమిళనాడులోని 'హోసూరు' పట్టణంలో 'తెలుగు సాంస్కృతిక సమితి' ప్రతి సంవత్సరం వేమన జయంతి జరుపుతోంది. వేమన ఆశ్రమాన్ని నిర్మించింది. వేమన దేవాలయాలు వెలిశాయి. రాయలసీమలోని 'కటారు పల్లె'లో వేమన సమాధి, ఆలయం వున్నాయి. రెడ్డి ప్రభువే అయినా వేమారెడ్డి అని నిజనామం ఉన్నా, ఆత్మీయంగా 'వేమన్న' అనే పిల్చు కుంటాం. ఆయన కుల, మతాలకు అతీతుడు. ఆత్మదర్శనం పొందినవాడు. జ్ఞానాగ్ని దగ్ధుడు. అహం బ్రహ్మాస్మికి అసలైన రూపు. అందుకే ఆయన ప్రతిభా విశేషాలను వివరించే ఒక కవి పద్యాన్ని కైమోడ్పుగా సమర్పిస్తున్నాడు.

" ఓ కవీ! నీదు పద్దియ మొక్కమారు
మనసుదీరగ, జక్కగా వినిన నరుడు
మరల జన్మములో, దాని మరచిపోక
సమయమొచ్చిన జదువును" సామెతగ ' ను.



జనవేమన

# చిట్టి కవులు

ప్రజాకలి వేమన తర్వాత సుమారు 80 సంవత్సరాల వరకు రెడ్డి కవులు ఎవరూ చరిత్ర పుటల్లోకి యెక్కినట్లు కన్పించదు. ఒకవేళ ఒకరూ, యిద్దరూ వున్నా, వారి గ్రంధాలు అముద్రితావటమో, అలభ్యమవటమో జరిగి వుంటుంది. వెతకగా వెతకగా శ్రీ బేడి రాఘవరెడ్డి ఒంటరిగా కన్పిస్తున్నాడు. కుంఫణీ యుగం వాడితడు. క్రీ.శ. 1800 ప్రాంతం వాడని ఆరుద్ర చెప్తున్నాడు. తెలంగాణాలోని దమ్మాల పేటకు చెందినవాడట. ద్విపద కావ్యంగా 'పూర్వ రామాయణాన్ని' వ్రాశాడు. ఆ రచన దాదాపు శిధిలావస్థలో వుందట.

ఈ కాలంలోనే 'దేశముఖ్'గా వున్న తూము రామచంద్రారెడ్డి 'అలమేలు మంగా పరిణయం ' అనే 4 ఆశ్వాసాల కావ్యం వ్రాశాడు. ఈ కవి గురువు ఉత్పల రంగా చార్యులట. ఇది పుక్కిటి పురాణం. వైకుంఠంలో శ్రీదేవికి, శ్రీమహావిష్ణువు కూ వాగ్వాదం జరిగిందట. ఆయన అలిగి తూము వారి సీమలో కొండ గుహలో దాగాడట. కవిగారు ఆయన్ను చూడటానికి వెళ్ళాడట. స్వామి తన గోడంతా భక్త కవికి విన్నవించాడట. ఇదంతా తన కావ్యంలో గర్వంగా రాశాడు కవి. ఈ కవి స్వామివారికి ఒక దేవాలయం కట్టించాడని, దివాన్ గారు ముచ్చటపడి ఒక గ్రామాన్ని ధూప దీప నైవేద్యాలకు యిచ్చాడని, కవిగారి కుమారుడు పరశురామారెడ్డి కూడ తండ్రికి తగ్గ కొడుకేనని, అలమేలు మంగా పరిణయం ' కావ్యం రాశాడని ఆరుద్ర ఉవాచ.

పాకనాటి గణపతిరెడ్డి దేశ రచనలో 'కృష్ణ విలాసం ' అనే యక్ష గానాన్ని వ్రాశాడు. శ్రీ కృష్ణ లీలలన్నీ దీనిలో మధురంగా వర్ణించాడట. డా. ఎస్.వి. జోగారావు తన యక్షగాన ప్రక్రియ రూపాల్లో యితని గురించి వివరంగా వ్రాశారు.

ఆరవీటి రాజులకాలంలో వున్న 'కామినేని ఎల్లారెడ్డి' 'లింగ పురాణం ' వ్రాశాడు. గుంటూరుజిల్లా ఫ్రెంచి వారికి వచ్చిం తర్వాత రాయప్పరెడ్డి వంశంలో ఓబుళరెడ్డి, అనంతరెడ్డి అనే అన్నదమ్ములు భక్తావాడలో వుండేవారు. విద్యా ప్రసంగాలు చేయించేవారు. కవులకు ఆశ్రయం కల్పించారు. పింగళి ఎల్లన్న అనే కవిలో 'సంజీవనాధ స్వామి ' కథను కృతిగా రచియింపజేసి అనంతరెడ్డి కొడుకు రాయప్పరెడ్డి అంకితం పుచ్చుకున్నాడు. రాయప్పరెడ్డి కవికి 'వాక్య గ్రంథి' యిచ్చాడు. దానిలో 'తోభ్యచరిత్ర ' రాశాడు కవి. ఇది క్రైస్తవ కావ్యం. 'సర్వేశ్వర చరిత్ర ' గా ప్రసిద్ధం. క్రైస్తవ గ్రంధ రచనకు కూడా రెడ్డి వారలు కవులచే శ్రీకారం చుట్టించారు'.

## "సమ్యక్ దర్శనం "
## మతాలపై ఝుళిపించిన కొరడా
## హిందూమతం

ఇప్పటివరకు మనం వేమన భావాలను స్థూలంగా పరిశీలించి చూశాం. ఇప్పుడు కొంత సూక్ష్మ పరిశీలన చేసి ఆయన భావదీపికా ప్రకాశాన్ని పొందుదాం. అజ్ఞాన తిమిరంలో వున్న మానవాళికి ఆయన అందించిన జ్ఞాన తేజస్సును పరికిద్దాం. ముందుగా వేమనకు మతం మీద వున్న అభిప్రాయాలను తెలుసుకుందాం. ఇది తెలుసుకొనే ముందు మతం అంటే యేమిటో మనకు తెలియాలి కదా ! 'రీజియన్ ఈజ్ రిలైజేషన్ ' అన్నారు. మతమంటే ఎరుక మనమెవరో మనం తెలుసుకోవటం. దాన్ని తత్వశాస్త్రి అన్వయం అన్నారు. ఇంతకీ తత్వశాస్త్రం అంటే ? ఆధ్యాత్మికంగా మానవుని పెరుగుదలే తత్వశాస్త్ర ఎలా జీవించాలి ? ఎలా చనిపోవాలని చెప్తుంది. ప్రకృతి, మానవ భగవంతుల సంబంధాన్ని వివరిస్తుంది. తత్వపరమైన ఆలోచన లోపలి ఆలోచనే. జరిగిపోయిన





దాన్ని గురించి కాక, జరుగుతున్నదీ, శాశ్వతమైన దాని గురించి చేప్పేది. దీన్నిబట్టి చూస్తే మతం చాలా పవిత్రమైనది. అపూర్వ గౌరవస్థానం కలిగివున్నది. అలాంటి మతంను ప్రవచించిన ప్రవక్తలు తాము సన్మార్గంలో నడిచి, అనుయాయులకు చక్కని మార్గాన్ని చూపారు, నిర్దేశించారు. అయితే కాలక్రమంలో ప్రవర్తలు చూపన మార్గాన్ని వదిలి, తప్పు దోవలు పట్టి మతాలు కొంత చెడుచేశాయి. ఉత్రృష్ట జీవన విధానం సడిలిపోయింది. ప్రలోభాలు, మూఢాచారాలు అమలులోకి వచ్చాయి. మతంపెద్ద పెద్దరికం పోయి హక్కు, అణచి వేతలకు పాల్పడ్డాడు. ప్రజలకు యేవగింపు కల్గటం ప్రారంభమైంది. ఇలాంటి సమయంలో సామాన్యులకు విలువ లేదా. మాన్యులకే మతంలో గౌరవం. ప్రజల కష్టసుఖాలు పట్టని స్థితిలో సంఘం తయారైంది. ఎవరు పూనుకొని దీన్ని మారుస్తారు ? కొంచెం కష్టమైనపనే. అందుకే ఆ బాధ్యతను కవులు, కళాకారులు చేబట్టారు. నెమ్మదిగా చెప్పారు. కళాత్మకంగా చెప్పారు. హితంగానూ, మితంగానూ చెప్పారు. అయినా మార్పులేదు. మార్పురాకపోతే సమాజం పతనావస్థకు చేరుకుంటుంది. అదిగో అలాంటి సమయంలో వేమన లాంటి మహనీయుని అవసరకం కల్గింది. అవినీతి, చెడు, దుష్టాచారం మాంసాన్ని దాటి ఎముకలకు పట్టి వదలని స్థితిలో సమాజం వుంది. కనుక చెప్పాల్సిన విషయాన్ని చాలా బలంగా, తీవ్రంగా కఠినంగా చెప్పాల్సి వచ్చింది. ఆ పనే చేశాడు వేమన. ఏ మతాన్ని వదిలి పెట్టలేదు. యే చెడ్డ విధానాన్ని విడిచి పెట్టలేదు. చాలా ఆవేదనలో, తీవ్రంగా, మనసుపై సుత్తితో కొట్టినంత బలంగా చెప్పాడు. మార్పు రావాలంటే ఆ మాత్రం అఘాతాలు తప్పవని భావించి చెప్పాడు. ఎవరో యేదో అనుకుంటారని భయంలేదు, బాధలేదు, మార్పురావాలి. చీకటిలోంచి వెలుగులోకి సమాజం రావాలి. అందరి సుఖమే ఆయన ధ్యేయం. అందుకే ఆయన మాట వేదం అయింది. వేదంలా శాసించింది. ఖచ్చితంగా అమలు చేయాల్సిన పరిస్థితి కల్గింది.

సనాతన ధర్మంగా హిందూ మతం మనదేశంలో వుంది. హిందూ మతంకాదు అదొక జీవన విధానం అంటారు. అయినా కాలగతంగా యెన్నో మార్పులు వచ్చాయి దానిలో. విగ్రహారాధన, యజ్ఞయాగాలు, మంత్రాలు, మాయలు, మాయస్వాములు, ఎక్కువై ధార్మిక మార్గం ప్రక్కదారి పట్టింది. ధర్మం కనుమరుగైంది. సాటి మనిషికి విలువ నివ్వలేని సమాజం తయారైంది. గుడులు, గోపురాలు, దేవతలు పీఠాధిపతులకు ప్రాచుర్యం పెరిగింది. మానవత్వం మృగ్యమైంది. మనిషిని మనిషిగా మార్చాల్సిన మతం కుహనా విధానాలకు నిలమైంది. అందుకే వేమనకు యీ పద్ధతులేవీ నచ్చలేదు. గమ్యాన్ని మంచి ప్రవర్తించే వారిపై పద్యాల పిడిగుద్దుల ప్రహారం చేశాడు. 'రాళ్ళన్నీ దేవుళ్ళయితే, రాసులు మింగవా ? " అని నిలదీశాడు. 'కూడు, గుడ్డను దేవుడు కోరడు ' అని గట్టిగా చెప్పాడు. అంతా రాయిమయం అయితే దేవుడెవరో, భక్తుడెవడో తెలుసుకొవటం యెలా ? శిలలకు మొక్కితే మనమూ ఆశిలలానే మారిపోతామేమో ఆలోచించమన్నాడు. దేహమే దేవాలయం అన్నమాటను వదిలి, మంచిని సోదర భావాన్ని గాలికి వదిలి ప్రసాదాలు, తీర్థాలు మరిగి బొజ్జలు పెంచుకోవటం హేయంగా భావించాడు. "గుడి దేహ మాత్మ దేవుడు / చెడురాళ్ళకు వట్టి పూజ సేయకు వేమా " ! అని హెచ్చరిక చేశాడు. చీకటి గర్భాలయంలో దేవుడని రాతిని ప్రతిష్టచేసి మొక్కులు సమర్పిస్తూ కాలక్షేపం చేస్తారుకానీ, తమ మనసులోని పరబ్రహ్మాన్ని గుర్తించరు మనుష్యులని వేదన చెందాడు వేమన. "ఉల్లమందు బ్రహ్మ ముందుట తెలియరు " అన్నాడందుకే. ముక్తికోసం చేసే ప్రార్థనాదులేవీ సత్ఫలితాల నియ్యవు.

"యుక్తిగా నెఋకై తోచును / ముక్తికి నిలయంపు దారి మానుకొని వేమా ! " ఎఋక వుంటేనే పరమ పదం సాధ్యం మిగినిలవేవీ పనికిరావని చప్పాడు. అసలు మర్మం తెలియకుండా మతాలు సృష్టించారని యీసడిస్తూ





వారిబావనలన్ని "గాజుటింట కుక్క కళవళ పడినట్లున్నాయని చమత్కరించాడు. పూజకంటె బుద్ధి ప్రధానం అని తిన్నని కథను గుర్తుకు తెస్తాడు. "పూజకేమి వచ్చె, బుద్ధి ప్రధానము " అన్నాడు. పరమాత్మ విశ్వంభరుడై, విశ్వంలో వెలుగుతూ వుంటాడు ' అతన్ని చూడమన్నాడు. 'క్షేత్రంబున క్షేత్రజ్ఞుని /గాత్రంబును జూచి నియతి గల లక్ష్యంబున్ / రాత్రింబవలును నొకటిగ / సూత్రించిన గలుగు ముక్తి సులభము వేమా ! అంటూ ముక్తికి సులభ మార్గం నిర్దేశించాడు. రాతి ప్రతిమను రాజసంలో వుంచి పూజచేసేవాడు బుద్ధి మాలినవాడు, అలాంటి వాడు 'భావమందు పరము భావించనేరడు " అని వాడి అవివే కానికి జాలి పడతాడు. 'శిలలు శిలలె కాని శివుడు కాడని / తనదులోని శివుని దానేల తెలియడో ? " అంటూ నిట్టూరుస్తాడు.

హిందూ మతంలో వున్న యజ్ఞయాగాలు దారితప్పి, హింసకు పట్టం కట్టాయి. జుగుప్సగా మారింది. కాలజ్ఞులు వాటిని సహించలేక పోయారు. ప్రత్యామ్నాయాలు సూచించారు. మార్పు వచ్చి పశుహింస తగ్గింది. తన కాలంలో యింకా అమల్లోవున్న పశుహింసపై విమర్శ వజ్రాయుధాన్ని ప్రయోగించాడు వేమన యోగీంద్రుడు, 'సోమయాజి /మేక పోతును బట్టి మెడలు విరవటం ' ఆయన్ను కలిచి వేసింది. ' జీవ హింసలకు చిక్కునా మోక్షంబు ?" అని తీవ్రంగా ప్రశ్నించాడు. ఇక్కడ యజ్ఞం చేస్తే స్వర్గంలో రంభాదుల పొందు విందు లభిస్తుందని ఆశ. అందుకోసమే యజ్ఞం అయితే అదికాదు వాంఛ మాత్రమే. దానికి మేకమాంసం తినాలా ? సోమయాజ కామయాజి అవటం ఉత్థానమా ? పతనమా ? అని ప్రశ్నించాడు. శాలువాలు కప్పి, మకరకుండలాలు దాల్చిన సోమయాజివల్ల మనకూ, సంఘానికి ఏమీ లాభం లేదని తేల్చాడు. ప్రక్కనవాడు ఆకలితో అలమటిస్తూంటే పట్టించుకోని జనం, తల్లిదండ్రుల శ్రాద్ధాలకు డబ్బు బాగా ఖర్చు చేస్తారు. పిండాలు పెడ్తారు. కాకిని పిల్చి మరీ పిండం అందిస్తారు.

అది తింటే పితృదేవతలు తృప్తి చెందారని సంతోషిస్తారు. ఇవన్నీ చూస్తే వేమనకు చిరాకు. చాలా కఠినంగా యిలాంటి వారిని మాటల్తో దండిస్తాడు. "పిండములను జేసి పితరులదసబోసి / కాకులకును బెట్టు గాడ్దెలారా / పియ్యతినెడి కాకి పితరుడెట్లా యెరా ?/ " అని మందలిస్తాడు. ఇంతకీ కాకులకే యెందుకు పిండం పెడతారు ? ఉత్తర రామాయణంలో ఓ కధ వుంది. మరుత్తడనే రాజు యజ్ఞం చేస్తుంటే, రావణుడు రాక్షస సైన్యంలో వచ్చి ఇంద్రాది దేవతలను భయపెట్టి పారదోల్తాడు. అప్పుడు వాళ్ళంతా పశు క్షాది రూపాలు పొంది పారిపోతారు. పితృదేవతలకు ప్రభువైన యముడు కాకి రూపం దాలుస్తాడు. అప్పట్నించి పితృ దేవతలకు వేసే పిండాలు కాకులకు పెట్టటం అలవాటులోకి వచ్చింది. అప్పటిదాకా పక్షుల్లో చాలా హీనంగా చూడబడీ కాకి, యిప్పట్నించి పవిత్రత సాధించింది. ' కాకి పెండ్లి నెవరు కనరు భువిని / కాకికి అన్నముంచి కాళ్ళకు మొక్కరు / అని ఆశ్చర్య పోతాడు లోకుల నైజాన్ని చూసి ' సంజ్ఞ మదియందు బూనుట సాధువృత్తి / మనసు మగ్నము నొందుట మనన వృత్తి " / అంతే కాని యజ్ఞయాగాదుల వల్ల ప్రయోజనం లేదంటాడు.

'చేసిన పాపం చెడని పదార్థం ' అని తత్వగీతం. ఎన్నెన్నో పాపాలు చేసి వాటి పరిహారణ కోసం తీర్థయాత్రలు చేసి, పాపం పోగొట్టుకుందామని అనుకుంటారు. పిల్లిని చంపిన పాపం వేరు, గుడిని కట్టిన పుణ్యం వేరు. హృదయాలు కడుక్కోవాలి. శరీరాలు కడుక్కుంటే మలినం పోదు. శారీరక మాలిన్యం కంటె మానసిక మాలిన్యం చాలా ప్రమాదం. దాన్ని తక్షణం వదిలించుకోకపోతే వుత్తమ గతులుండవు. పశ్చాత్తాప దగ్ధంతోనో, పరోపకారంతోనో, సహనంతోనో, సత్కర్మతోనో, సానుభూతి, సహవేదన, దయ, దాక్షిణ్యం, కరుణలతో మనో మాలిన్యం పోతుంది. గంగాది నదుల్లో స్నానాలు చేసినా, కాశీ ప్రయాగ మొదలైన తీర్థాలు సేవించినా, ఆత్మ సంస్కారం రాదు.





దాన్ని సద్గురు కటాక్షంలో సాధించాలి, అందుకే వేమన అధిక్షేపణగా ' తిరుపతికిని బోవ తురక దాసరిగాడు / కాశి కేగ లంజ గరితగాదు / కుక్క సింహమగునె గోదావరికి బోవ ? " అని వితర్కిస్తాడు. విజ్ఞాన మైన ఆత్మబోధ చేస్తాడు. కల్మషాలన్నీ కడుపులో పెట్టుకొని నదీస్నానాలు, భగవద్దర్శనాలు చేస్తే ప్రయోజనం లేదంటాడు. మానసిక మార్పురావాలి. ఒకవేళ అపవిత్ర స్థలాల ప్రభావం వల్ల అంతటి మార్పువస్తే వేమన కంటె సంతోషించేవారుండరు. కొన్ని స్థలాలు పవిత్రాలు, కొన్ని అపవిత్రాలు అని భావించటం తప్పు . 'పుణ్యమనగ నేమి చేసిన కర్మమే " అని చక్కని సమాధానం చెబుతాడు వేమన.

# "శైవమతం "

# ఇతర మతాలపై వేమన దృష్టి

హిందూ మతంలో వున్న లోపాలను గమనించి, వాటిపై స్పందించాడు వేమన అనేక విషయాలలో, మరి ఆయనకు యేమత మంటే యిష్టం ? దేనిపై అధిక ప్రేమ చూపాడు ? క్రైస్తవ మహమ్మదీయ మతాలపై ఆయన అభిప్రాయాలేమిటి ? ఇవన్నీ తెలుసుకోవలసిన విషయాలే.

వేమన పద్యాలను కొంచెం లోతుగా చదివి పరిశీలిస్తే ఆయనకు శివుడన్నా, శైవమతమన్నా మక్కువ అన్నట్లు కనిపిస్తుంది. జన్మత : ఆయన శైవుడే. అయితే దేన్ని ఆయన మూఢంగా ఆరాధించడు. అది వేమన ప్రత్యేకత. ముందుగా శైవంపై ఆయన అభిప్రాయాలను చూద్దాం. 'ప్రణవమంత్ర , మహిమ భావింపలింగంబు / మూడు మూర్తులందు మొనసి యుండు / నతని నెరిగి కొలువ నన్యులశక్యము ' అని త్రిగుణాత్మకుడు, త్రిమూర్త్యాత్మకుడు, త్రిగుణా తీతునిగా శివుని భావించాడు. కంటి మంటలో కాముణ్ణి దహించి, కామవాంఛలో

గౌరిని అర్థాంగిని చేసుకొన్న శివుని చూస్తే అంటిన పూర్వ కర్మఫలం పోతుందని ధీమాగా చెప్పాడు. శివుడు, గౌరి శైవగణం తన బంధువులను కొన్నాడు. " పంచాక్షరి పూజలలో అఖలజ్ఞుడై, వంచన లేకుండా తిరిగేవాడే శంభుడు " అని తేల్చి చెప్పాడు. 'శ్రీమదు మా పతియగునా / స్వామికి దాసుండనంగ జగములు పొగడన్ / వేమనయని యెడుధీరుడు / అని తాను పరమ మాహేశ్వర భక్తునిగా చెప్పుకొన్నాడు. 'హరిహరులకు రూపమవనిలో శివరూపె ' అని ఘంటాపథంగా చెప్పాడు. 'శివుని అనుభవం సృష్టిలో చూడకపోతే, సంశయం తీరదు, దివ్వె లేకుండా చీకటి పోతుందా ? అంటాడు. 'శివ యను రెండక్షరములు / భువిలోనెవడైన గాని పొలుపు దలిర్పన్ / శివ శివయని శతవారము / ప్రవిమలమతి వల్లె వేయబరుడౌ వేమా " / అన్న పద్యంలో శివనామ మహాత్మ్యాన్ని వర్ణించాడు. ' శివయోగి జ్ఞానదీపం భువనాలన్నిటిని వెలుగ జేస్తుందని నిస్సందేహంగా అంటాడు. శివునిపై, శైవంపై యింత అభిమానం వున్నా, అందులోని భావాన్ని గ్రహించకుండా, బాహ్యాడంబరంగా ప్రవర్తించే వారిని చూస్తే వేమనకు కోపం. వారి ప్రవర్తనను యెండగట్టాడు. 'భూతి దేహమందు బూసిన నయ్యెనా / నిష్ఠ శివుని యందు నిల్వ వలయు " అంటూ గాడిద బూడిదలో పొర్లాడితే దానికేమైనా పరమ పదం వస్తుందా ? అని ప్రశ్నిస్తాడు. 'భక్తి లేని పూజ పత్రి చేటు ' మెడలో లింగాలు కట్టుకొని, ఘంట వాయిస్తూ తిరిగే వారికంటే దొంగలు నయం అన్నాడు. ఆత్మలింగాన్ని వదిలి, యెక్కడో వెతకటం మూఢం అంటాడు. జులపాల జడలు, పులితోలు, విభూతి, రుద్రాక్ష మాలలతో వీరశైవులుగా తిరిగే వారంతా మోత గాళ్ళే కాని మోక్ష గాళ్ళు కాదన్నాడు. లింగ ధారుల్లో గంజాయి తాగే వాళ్ళు యెక్కువ అని అంటారు. దానికి 'జ్ఞాన పత్రి ' అని పేరు. అది పీలుస్తూ, యిహలోక స్పృహకోల్పోయి వూహాలోకంలో విహరిస్తూంటారు. ఏదో మాట్లాడ్తారు. పూనకం పూనినట్లు





ప్రవర్తిస్తారు. వీరు సాధించేదేమీ లేదని తేల్చాడు. దయ్యాలను వదిలిస్తామని యిట్లాంటి వాళ్ళు జనాన్ని మోసం చేసి బతుకుతూంటారు. అట్లాంటి వాళ్ళని " నిన్నె గాంచి భీతి నిలువక పారధా "? అని హేళన చేస్తాడు. యజ్ఞ యాగాలను, నిరసించిన వీరశైవులు యెద్దునెక్కి, దాన్ని తన్నుతూ, కొట్టూ ప్రయాణం చేస్తూ జీవహింస చేస్తున్నారని యీసడిస్తాడు. వీరూ మాంసభక్షణ మరిగారని దుమ్మెత్తి పోశాడు వీరిలో మిండజంగాలు, బసివిలు యెక్కువై వ్యవస్థ భ్రష్టమైంది. ఆచారం అనాచారమైంది. బసివికి యెంతమంది జంగాలతో వ్యభిచరిస్తే అంతగొప్ప. ఆమెకు పుట్టినవాడు జంగమదేవరలో గొప్పవాడు. ఇలా భ్రష్టత చెంది ముస్లింలచేతిలో ఓడి పోయారని, " భ్రష్టస్య కావాగతి : " అన్నది రుజువు చేశారని బాధపడ్డాడు వేమనయోగి.

## వైష్ణవం

కన్నడ దేశంలోని బసవేశ్వరుని మతం ఆంధ్రలో వీర శైవంగా విజృంభించింది. పాల్కురికి సోమనాధుడు వంటి వీర శైవ కవులు ఆ మత వ్యాప్తికి కవిత్వావలంబనతో బాసటగా నిలిచారు. ఇంక వైష్ణవ మతం తమిళ దేశం నుంచి, ఉత్తర దేశం నుంచి వచ్చి పాదుకొంది. చైతన్యుని ప్రభావం మన రాష్ట్రం పైన బాగా పడింది. అన్నమయ్య పదాలు, పోతన భాగవతం, రామదాసు కీర్తనలు, క్షేత్రయ్య పదాలతో ఆంధ్రదేశం వైష్ణవ భక్తికి ఆలవాలమైంది. తిరుపతి, భద్రాచలం క్షేత్రాలు ముక్తిధామాలైనాయి. భక్తి ప్రపత్తులకు నెలవైనాయి. గోదాదేవి పాశురాలు, ధనుర్మాస ఉత్సవాలతో, సీతారామ కళ్యాణాలతో, తిరుమల బ్రహ్మోత్సవాలతో వైష్ణవ భక్తి యేరులై ప్రవహించింది. శివుడు అభిషేక ప్రియుడైతే, విష్ణువు అలంకార ప్రియుడు. దైవం ఎలా వుంటే భక్తులూ అదే వేషధారణ చేయటం మామూలైంది. శైవంలో యెలా వీర శైవం వచ్చి వీరంగం వేసిందో,

వైష్ణవంలోనూ వీరంగం సాగింది. నిలవు బొట్లు, పంగనామాలు, తులసి పేర్లు, కస్తూరి పరిమళాలు, చక్ర పొంగళ్ళు, లడ్లు, దధ్యోజనంలతో భక్తులంతా విలాస పురుషులైనారు. వేశ్యా సంపర్కం ఫాషనై పోయింది, హోదా అయింది. పూజలు, సంకీర్తనలు, భజనలు, తిరునాళ్ళు పెరిగాయి. భక్తి వరదలా పొంగింది. అడ్డు కట్టల్లేవు. విశృంఖలత పెరిగి, నిస్సిగ్గుగా ప్రవర్తించటం సర్వ సాధారణమైంది. ఇవన్నీ చూసి వేమన లాంటివాడు వూరుకోగలడా? ఈయనకు స్వ, పర భేదం లేదు. అందుకే యెండగట్టాడు. ద్వాదశ పుండ్రాలు, ద్రవిడ గ్రంధాలు, అక్షయ పాత్రలతో వీధిలో భిక్షం యెత్తుతున్నారని యెద్దేవా చేశాడు. ప్రజల్ని పీడించి డబ్బులావుగా సంపాదించి దీనుల్లా. దరిద్రుల్లా ప్రవర్తిస్తున్నారని అధిక్షేపించాడు. "పట్టుబట్ట గట్టి పట్టి నామము బెట్టి/వట్టి భ్రాంతి జెంది వైష్ణవుడయి/లొట్టి ద్రావనతడు లోకుల జెరచురా"/ అని గోల పెట్టాడు. బధువు, మాంసం రుచి మరిగి ""వావి వరుస దవ్వి వర్తించి చెడుదురు" అని రంగులు బయట పడేశాడు.'పల్లాండు – పల్లాండు' అని ద్రావిడ పాశురాలను పాడుతూ, అర్ధం కాని భాషలో అరవ పాటలు పాడేవాళ్ళను చూసి, వాళ్ళ మూఢాచారాలను చూసి, ఆంధ్ర దేశానికి యేదో చెడు దాపురించిందని వ్యధ చెందాడు. శంఖ చక్రాంకితాలతో ఒళ్ళంతా వాతలు పెట్టుకొంటున్నందుకు వీళ్ళని దుయ్యబట్టాడు. "తనువున దావాగ్ని దరి కొని కాలంగ/కాల్చుకొనగ యేమి కర్మమునకు?" అంటూ అలా చేస్తే ఘనుడౌతాడా అన్నాడు. ఇవన్నీ వికృత, వెర్రి చేష్టలుగా తలచాడు. ఇంతకీ ఏ మతమైనా బాహ్యాడంబరం కంటే అంతస్సౌందర్యం, భావన, చింతన, ప్రవర్తన, పరమ సాధన, పరజన హతం కావాలని వేమన దృఢంగా భావించాడు. అందుకే యెక్కడ విపరీత భావన వుంటే అక్కడ యిది పద్ధతి కాదు, మార్చుకోమని హితవు చెప్పాడు.





## విశ్వ కుటుంబి

తాను చూస్తున్న ప్రతి విషయాన్ని ప్రజలకు అనుభవంలోనికి వచ్చేట్లు వ్రాయటం కవి చేసే పని. దీనికి మంచి భావనా శక్తి, పదునైన పద శక్తి తోడైతే వ్రాసిందంతా బంగారమే. ఆ రెండు శక్తులు వేమనలో వున్నాయి. విపరీతమైన లోక పరిశీలన ఆయనలో వుంది. జీవితాన్ని కాచి వడపోశారు. అనుభవసారం సాంద్రంగా వుంది. తత్వజిజ్ఞాన ఆయనలో వేళ్ళూనింది. దార్శనికత దారి చూపింది. ప్రతిదీ విచారించి తెలుసుకునే విచక్షణ వుంది, విజ్ఞానం వుంది. ఆ మూడు లక్షణాలు త్రివేణి సంగమంలా ఆయనలో నిలిచాయి. అందుకే ఆయన మాట్లాడిన ప్రతిమాట పవిత్రమైంది. చైతన్య వంతమైన ఆలోచన వుంది. "దార్శనికులు ప్రపంచాన్ని వ్యాఖ్యానిస్తారని, ప్రవక్తలు మాత్రమే ప్రపంచాన్ని మార్చటానికి ప్రయత్నిస్తారని, వేమన అభ్యుదయ ప్రవక్త " అని ఆరుద్ర నిర్వహించారు. ఆయన సిద్ధాంతం 'సంసారయోగం '. ఇది వుంటే స్వర్గం కూడా అక్కర్లేదన్నాడు. ఆ యోగాన్ని బాగా ప్రచారం చేశాడు. ఇన్ని విషయాలపై యింత సాధికారంగా మాట్లాడిన వేమన యేవిద్య నేర్చాడు ? అన్నీ సందేహం అందరికి సహజం. వేమనకు పుస్తక జ్ఞానం లేదని కట్టమంచి వారంటే, వేమన రామాయణ, భారతాలు, బసవ, శివపురాణాలు చదివి వుంటారని రాళ్ళపల్లి వారు భావించారు. శ్రుత పాండిత్యం యెక్కువ. ఉపనిషత్తులు చదివి వుంటాడని వావిళ్ళ వారన్నారు. ఆరుద్ర మాత్రం యోగం, తంత్రం, ఉపనిషత్తులు, గుప్తవిద్యలు వేమనకు కరతలామలకాలని చెప్పారు. కవి చౌడప్ప "వానకు తడియని వాడును / పూనిక వేమన్న చేత బొరయనివాడున్ / నానా దిక్కుల వెదకిన కానమురా / కుందవరపు కవి చౌడప్పా " అని కితాబిచ్చాడు.

"విశ్వదాభిరామ వినుమరేమ " అన్నమకుటం చాలా ప్రాధాన్యత సంచరించుకొంది. విశ్వం అంటే సకల ప్రపంచం అని ఆయన భావించాడు.

తాను చెప్పేది, విప్పేది, బోధించేది, నీతులు నేర్పేది అభిరామంగా అంటే మనసుకు ఆహ్లాదం యిచ్చి మనోహరంగా వుంటు, కర్ణ పేయమై 'దా' అంటే యిచ్చే వాడినిగా తన్ను భావించుకున్నాడు. అంటే ప్రపంచ ప్రజలకు ఆదర్శవంతం, నీతి మంతం అయిన మాటలను మనోహరంగా, హృదయాలకు హత్తుకొనేటట్లు, వినటానికి యింపుగా అందించే కవిగా అంటే ప్రజాకవిగా తన్ను భావించాడు. అయితే ఎవరికి చెప్పినా, ఆ చెవిన విని, యీ చెవిన వదిలేయటం లోక సహజం. కనుక ఎవరికో యెందుకు తనకు తానే చెప్పుకొన్నట్లుగా 'వినురవేమ' అనుకొన్నాడు. తానే గురువు, తానే శిష్యుడు. ఆత్మ ప్రబోధకంగా, ముక్తకాలుగా చెప్పిన పద్యమౌక్తకాలివి. 'ఆటవెలది ' ఆయన్ను సన్యాసాశ్రమంలోనూ వెంటాడుతూనే వుంది. ఆ ప్రభావం, గాధమవటంలో పద్య ఛందస్సూ ఆటవెలదీ అయింది. మురిపించింది. జనాన్ని మైమరపించింది. స్వాధీన పతిక అయింది. తెలుగువారికి ప్రీతి పాత్రమయింది. అందుకే వేమన గారిని 'విశ్వకుటుంబి ' అని ఆరుద్ర అనటం అక్షర సత్యం. వేమన తన జీవిత గతినే మార్చుకున్నాడు. సంస్కారం సాధించాడు. ఆత్మ సంస్కార శోభితుడయాడు. అందుకే ఆయన మాటకు అంతపదును. ఆయన భావానికి అంత నిగ్గు. ఆయన పద సంపదకు అంతటి ఆదరణ, అభిమానం. లోకాభిరామం ఆయన పద్యాలు.

## వేమన చెప్పిన 'సంసార యోగం '

"తన దేశకాల పరిస్థితుల వల్లా, తన తనువులో పుట్టిన తత్వం వల్లా వేమనగారు ఎన్నో ఆచారాలు, వ్యవహారాలు, కర్మకాండలు, ధర్మశాస్త్రాలు చూసి, కాచి వడపోసి ఒక సిద్ధాంతానికి వచ్చారు. దాన్ని 'సంసారయోగం ' అన్నారు. అదే పని కట్టుకొని ప్రచారం చేశారు. ఇదుంటే స్వర్గం అక్కరలేదన్నారు " అని ఆరుద్ర వేమన సిద్ధాంతాన్ని వివరించారు. ఆ వివరణలోకి వెళ్ళి చూద్దాం.





'సుగుణవంతురాలు సుదతియై యుండిన / బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప / స్వర్గాదపి గరీయసి అని తేల్చి చెప్పిన అనుభవం ఆయనకుంది. సమాజంలోని వైరుధ్యాలను సమన్వయం చేసుకోవాలి. జ్ఞానం యొక్క పూర్వాపరాలను ఆర్థింపు చేసుకోవాలి. ఆహార, ఆచార వ్యవహార విషయాలలోని మూల తత్వాలను తెలుసుకొని బ్రతికినపుడే గృహస్తు అన్నీ పేరు సార్ధకమవుతుంది. ఇంటికి దీపం యిల్లాలే. ఆమె మాటల్లో మాధుర్యపు వూటలుంటాయి. 'పసిడి కన్న మిగుల పడతి మాటలు తీపి ' అన్నాడందుకే. తల్లి, తండ్రిలతో అక్క, అన్న సమానం. వాళ్ళను యెదిరించటం పాపం. ప్రత్యక్ష దైవాలే తల్లిదండ్రులు. వారిని గౌరవించటమే దేవతార్చనం అని భావించి "తల్లి దండ్రి కంటే వేరెదైవంబు లేదయా " అన్నాడు. కుటుంబం చల్లగా, చక్కగా సాగాలంటే అందరూ శ్రమించాలి. తల్లి దండ్రులపూ ఆధారపడి జీవించటం మంచిది కాదు. శ్రమయేవజయతే ' అన్నది అంతా పాటించాలి. "చెమటకారునట్లు శ్రమజేసి దేహంబు /గడన చేసికూడు గుడ్డువవలయు /తల్లి దండ్రి సొమ్ము తాదింటగారాదు " అని సుతిమెత్తంగా కర్తవ్య బోధ చేశాడు. 'కులంలో ఒకడు గుణవంతుడున్నా, వాడివలన కులం వెలిగిపోతుంది ' అంటాడు. తల్లి దండ్రులమీద దయలేని పుత్రుడు పుట్టినా గిట్టినా ఒకటే – అలాంటి వారు పుట్టలో వున్న చెదపురుగుల వంటివారు. ఐతే యివాళ చెదపురుగు చేసే హాని చాలా వుంది. దాన్ని నివారించటానికి ఆధునిక విధానాలు వచ్చాయి. సమాజంలో యిలాంటి చెదపురుగులు చేరితే, సమాజ వృక్షానికే ప్రమాదం. అమ్మను, ఆలిని సమానంగా చూడాలి. అలా చూసినవాడే నేర్పరి. భార్యభర్తలు పొరపొచ్చాలు లేకుండా ఒకే మాటలో జీవిస్తే సంసారం స్వర్గం అవుతుంది. ఆలు మగని మాటకు మాటి మాటికీ అడ్డం వస్తే ఆమె 'మరగాఎ ' అవుతుందని, అలాంటి దాన్ని వదిలించుకోవటం మంచిదని చెప్పాడు. సంసార రధానికి భార్యభర్తలు రెండు

చక్రాలు. రెండు గుర్రాలు. ఒకరు ఏటికీడిస్తే యింకొారు కోటికీడ్చరాదు. అని గుర్తు చేశాడు. సంసారం కోసం కష్టపడే యజమానికి తోడెవరూ వుండరు – బ్రహ్మలోకమే తోడు. పుత్ర గాత్ర పరిష్వంగ సుఖాన్ని శకుంతల దుష్యంతునికి వివరించింది అభిజ్ఞాన శకుంతలంలో. అలానే 'సతికి సుతుని వలన సౌఖ్యంబు కలుగును " అంటాడు వేమన్న. తండ్రి కంటె కొడుకు గుణవంతుడైతే, చిన్నవాడైనా కొడుకునే గౌరవించాలి అంటాడు. మత్సరం, మదం, మమకారాలనే వ్యసనాలను వదిలి, పరోపకారం చేస్తే వాడే రాజయోగి. అధిక సంతానం అనర్థాలకు మూలం. చిన్న సంసారం చింతలు లేని సంసారం అని ఆనాడే చెప్పాడు. పందిలా పిల్లల్ని కనవద్దని హితవు చెప్పాడు. ఏనుగు ఒక్క పిల్లనే కంటుంది. అదే ఆదర్శం కావాలి అంటూ 'ఉత్తమ పురుషుండు ఒక్కడే చాలురా ' అని ముక్తా యిస్తాడు. ఇద్దరూ వద్దు. ఒక్కరే ముద్దు. 'పతి యొప్పిన సతి యొప్పును / పతి సతులొాక టైన పరమ పావన మందున్ / సతిపతి న్యాయమె మోక్షం /బతులిత పరమాత్మ యైక్యమగురా వేమా " అని సతీపతి ఐక్యమత్య సంసార సుఖసారం అని ఆమాధుర్యాన్ని విప్పి చెప్పాడు. ఇంకొాంచెం ముందుకు వెళ్ళి వేదాంత భావాన్ని వివరించాడు – 'సతి యందే పతిపుట్టె / పతియును సతియందేపుట్టె బరమార్థముగా / సతిపతులనగా నెవ్వరు / మతిలో దలపోసి చూడు మహిలో వేమా " అని పరమ సత్యాన్ని బోధించాడు. వేదాంత గురువైనాడు. ఆడది చేసే తప్పు మగవాడికీ చెందుతుంది. పతి చేసే మంచి సతికి సగం. పతిచేసే తప్పు సతికెందుకురాదని ప్రశ్నించాడు. ఈ విధంగా చక్కని అవగాహనతో కుటుంబ సభ్యులుంటే యిల్లే స్వర్గం. కాకుంటే నరకం. అందరిదీ సమాన భాగస్వామ్యమే. ఏ ఒక్కరు గడిదాటినా ఛిద్రమే.

ఈ భావాలకు భిన్నగా ప్రవర్తించిన వారిని వేమన ఉతికి ఆరేశాడు. అక్కడ ఆడా మగా తేడా లేదు. తప్పువుంటే చాలు ఉప్పు పాతరే వేశాడు.





అంత క్రమశిక్షణ జీవన విధానంలో వుండాలని ఆయన భావించాడు. 'వెలయ భూమి తల్లి, విత్తనంబటు తండ్రి /పంటలరయ సుతులు పాడి పరము / ధర్మమే తన పాలిదైవంబు తలపోయ ' అని సంసార సూత్రాన్ని ఆవిష్కరించాడు కదా – దీనికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే సహిస్తాడా ? స్త్రీల విషయంలో పురుషుల దాష్టీకాన్ని నిలదీశాడు. 'భర్త వర్తనంబె పడతికి గ్రాహ్యంబు ' అన్నాడు. ఆడదంటే నరకం అన్నీ భావన సరికాదన్నాడు. పురుషులంతా పుణ్యం చేత జన్మించారని, పాపం అంతా స్త్రీ రూపం అని భావించిన వారి కళ్ళు తెరిపించాడు. "కాంత నెల్లప్పుడు కావలేనినాడు చావవలయు " అని పురుషుణ్ణి నిందించాడు. ఇల్లాలిని వదిలి పరస్త్రీ పొందుకోరే వ్యభిచారులపాలిట యమపాశమయాడు. 'పంట చేను విడచి పరిగ యేరినట్లుంటుందట వాడి ప్రవర్తన. వేశ్య డబ్బుగుంజి జబ్బు అంటగట్టుంది. కొారక నేర్చిన గేదె గోకతే చేపుతుందా ? అన్నాడు. వేశ్య మాతల దౌష్టం కళ్ళకు కట్టిస్తాడు. యవ్వనంలో వున్న స్త్రీలను బజారులో వుంచి విటులనుంచి డబ్బులు గుంజి, వారిని పాపర్లను చేసేసి, వారినీ, స్వయానా తమ కూతుళ్ళనూ వసివాడగానే తన్ని తరిమేస్తారు. కనుక ఇల్లాలి తోనే సుఖం పొందమని అందరికి సలహా. వేశ్యలవలపు బూటకం. ఆడదంటే అందరికీ అలుసే – ఆశే. 'వెర్రి వానికైన వేషధారికి నైన / రోగికైన బరమయోగికైన / స్త్రీల జూచినపుడు చిత్తమ్మురంజల్లు "అని మగవాడి చిత్త కార్తి తనాన్ని బయటపెట్టాడు. ఆలివంకవారిని ఆత్మబంధువులుగా చూడటం, తల్లివంకవార్ని దూరం చేయటం, తండ్రి వంకవారు దాయాదులవటం లోక సహజంగా చెప్పాడు. మగడున్నప్పుడు ఆడది కష్టపడితె, కొడుకుల కాలంలో సుఖం అనుభవిస్తుంది. కనుక 'కలిమొలేములెందు గలవెంత వారికి / బలిమిపుత్ర బలమె బలిమి / " అండగా వుంటే నిండుగా వున్నట్లే. 'మాలపైన ప్రేమ మర్యాద కాదుకో ' అని మాతృప్రేమ విలువ చెప్పాడు. డబ్బున్నప్పుడే ధవుని మర్యాదగా చూస్తుంది

భార్య. డబ్బులేకుంటే దుబ్బుకు కొరగాని వానిలా చూస్తుంది. 'వెలియాలి వల్ల కూరిమిరాదు. వస్తే వదలదు. అందరూ నడిచేదార్లో గడ్డి మొలవదు – 'మొలిచెనే డిపోదలదు ' అని లోక సహజంగా చెప్పాడు. ఇలా ఎవరైనా కుటుంబం వదిలి దారి తప్పితే, ఆ కుటుంబం అంతా దెబ్బతింటుందని అందర్నీ హెచ్చరించాడు.

## వేమన దృష్టిలో స్త్రీ

స్త్రీకి సమాజంగా ఉన్నత స్థానం వుంది. దాన్ని ఆమె కాపాడుకోవాలి. మంచి నడవడిక, సంస్కారం సంప్రదాయం వున్న స్త్రీ అంటే వేమనకు గౌరవే. అయితే కొంతమంది పురాణ స్త్రీలు స్వార్థంతో ప్రవర్తించిన సందర్భంలో ఆయన వారి ప్రవర్తనను పద్యాల్లో బంధించి, ఆలోచించి చూడమన్నాడు. అంత మాత్రంచేత ఆయన స్త్రీ ద్వేషిగా భావించలే. "ఔర యాడు దానినా బ్రహ్మసృష్టించె / పురుషు పాలిటి పెనుభూతమట్లు ' అన్నాడు. అంతమాత్రాన ఆయన స్త్రీ ద్వేషా ? శ్రీరామకృష్ణ పరమహంస కాంతా కనకాలకు దూరంగా వుండమని ప్రతిసారీ చెప్పేవారు. ఒక ఉత్కృష్ట స్థితి పొదటానికది మార్గం. అంతా సన్యాసులు కాలేరు – కాకూడదు. లోక రీతి జరగాలికదా – సృష్టి కార్యం సాగాలి కదా ? దీనికే వ్యతిరేకత లేదు. ఆ మోహాన్ని తగ్గించుకోవాలని భావం. స్త్రీ శరీరాన్ని 'చెలగి యగ్ని జూచు శలభంబు చాడ్పున " ఆ మోహాగ్నిలో దగ్ధం అవ వద్దన్నాడే కానీ, వివాహం, సంసారం వద్దన లేదే ! చెప్పినమాట వినే గృహిణి వల్ల ఇల్లు స్వర్గం, అలా కాకుంటే నరకం ' అన్నాడు. 'ఆడ బుద్ధి కంటే అపరబుద్ధియేది ? ' అనీ ప్రశ్నించాడు. ఇది స్త్రీని అవమానించటమేనని, వారి మనసును వేమన తెలుసుకొలేక పోయాడని రాయసం లక్ష్మిగారు అభిప్రాయపడ్డారు. ఇది సరైనది కాదని వేమన తత్వం తెలిసిన వారు కాదన్నారు. 'మూడు కొప్పులున్నచోట చుక్కలు పొడుచు " అన్నాడంటే లోక రీతిని చెప్పాడని అర్థం. స్త్రీలు మనసులు





కలపరని, కలిపి పని చేస్తే వారి కెదురులేదని అర్థం. 'కైక బుట్టి చెఱిచె కౌసల్య తనయుని / సీత పుట్టి లంక జెఱిచె గాదె / కౌరవులను జెఱిచె గద ద్రౌపది యు గూడ "/ అని రామాయణ, భారతాలలో వున్న పాత్రల స్వభావాలను చెప్పాడు. ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క పరమార్థం వుంది. అది గూఢంగా వుంటుంది. అయితే సామాన్యుల భావన తేడాగా వుంటుంది. దాన్ని ప్రతిబింబించే పద్యమేయిది. స్త్రీలుంటే తగాదాలుంటాయి. వాళ్ళు లేకపోతే శోభేలేదు – రెండూ నిజమే. సందర్భాన్ని బట్టి కవి చెబుతూంటాడు. అంతే తప్ప ఏదో ఒక దానికే ఆయన కొమ్ము కాశాడని భావించటం మంచిది కాదు. స్త్రీకి వున్న శక్తి సామర్థ్యాలుఆయనకుతెలుసు. అందుకే కుటుంబంలో స్త్రీ స్థానం వున్నతంగా ముందే చెప్పాడు. ఆ మార్గాన్ని దాటిన వారినే ఆయన ఎత్తి చూపించాడు. ఆయెకున్న ఓర్పు భూదేవి వోర్పు. 'ఒడు శిధిలమైన నోరుపుగల సతి / గుణము మేర్మి బట్టి కోటి సేయు / అనటంలో స్త్రీ సహజమైన ఓర్మికి పట్టంకట్టినట్లు కాదా ! 'అన్య పురుష వాంఛ యాడుదానికి నుండు " అన్న మాట అందరు స్త్రీలకూ వర్తించదు. నీతి శతక కర్తలంతా యిలా చెప్పినవాళ్ళే అటు సంస్కృతంలోను, యిలా తెలుగు లోను – లోకరీతి కిది వ్యాఖ్యానమే కాని వారినందర్నీ ఒకే గాటకట్టేయటం కాదని తెలియాలి. ఎక్కడ తప్పుంటే అక్కడ ఆయన మాటల్తో చెళ్ళుమనిపిస్తాడు. ఎక్కడ మంచి వుంటే అక్కడ ప్రశంసించాడు. ఆయన అన్నిటికీ అతీతంగా వుండి చెప్పిన హితవులు. మనకున్న కొద్ది పరిజ్ఞానంతో ఆయన్ను ఒక వర్గానికి ద్వేషి అని ముద్ర వేయటం వివేకం అనిపించుకోదు.

"యోగి వేమన నిస్సంగంగా వున్నపుడు దార్శనికునిగా కన్పిస్తాడు – ఆ స్థాయిలో వున్నా పూర్వ భోగా శ్రమ గతులూ, సంగతులు మెదలినపుడు, లోకులు తమ కష్టాలు చెప్పుకున్నప్పుడు, ప్రజా కవిగా, సంస్కర్తగా దర్శనమిస్తాడు.

ఆ సందర్భంలో జనవ్యవహారంలోని మాటలు వాడినప్పుడు పెడసరి, గడసరి తనం కన్పిస్తుంది. భోగస్త్రీలను గురించి చెప్పినపుడు, భర్తకు చాటుగా వ్యవహారాలు నడిపిన స్త్రీలపై వ్యాఖ్యానం చేసినప్పుడు – అవును – వేమన్న స్త్రీ ద్వేషిగానే కన్పిస్తాడు " అని ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి చక్కని తీర్మానం చేశారు. తీర్పు ప్రకటించారు. ఇలా అర్థం చేసుకోవాలి కాని కువాదాలు చేసి మనసుల్ని గాయపంచరాదు. ఆ మహా మహుని ఆంతర్యాన్ని శంకించరాదు. భార్యా భర్త బంధం జీవాత్మ పరమాత్మల బంధం అని అనాదిగా మన నమ్మకం. ఇతరుల కోసం జీవిస్తూ, వారి బాధలు తీర్చేవాడు వేదాంతి. తన భార్యతో మాత్రమే దాంపత్య ధర్మం నెరవేర్చేవాడు ' సంసారయోగి ' విషయాలను నెగటివ్‌గా చెప్పి మనుష్యుల్ని పాజిటివ్ ' గా మార్చటానికి వేమన ప్రయత్నించాడు. ఒక భోగినీ, యోగినీ ప్రవర్తనల మధ్య వేమన జీవాత్మ వికసించింది. అందుకే నడుమ బట్టకట్ట నగు బాటు కాదొకో అన్నాడు ". అని ఆచార్య కసిరెడ్డి చక్కని విశ్లేషణ చేశారు. బుద్ధి చెప్పేటప్పుడు గుద్ది చెప్పాలి అన్న సత్యం ఒంట బట్టినవాడు వేమన. మార్గదర్శి. మహిత తత్వదర్శి.

ఇంకో తమాషా యేమిటంటే ఏ పద్యం వేమనది ? ఏది కాదు ? అని తీర్మానించి చెప్పటానికి వీలు పడని స్థితిలో వున్నాయి శతక పద్యాలు. అందులో ప్రక్షిప్తాలెన్నో ఎవరికీ తెలియంతగా కలిసిపోయాయి. "ప్రపంచంలో యేదైనా సామెత చెప్పాలంటే వేమన్న దగ్గరకే పోవాలి మనం'. ఆట వెలది వలచి అడుగంటె వేమన / ఆట వెలది వలచి ఆయెఘనుడు / వెలది వెలదిలోన కలదురా భేదమ్ము " అని తన నిజ స్వరూపాన్ని, ఆయన భావాలంత దిగంబరంగా ఆవిష్కరించాడు. ఏదీ దాచలేదు. మగవాని ఉత్థానానికైనా, అధ : పతనానికైనా ఆడదే కారణం అని చరిత్ర, పురాణాలు, లోకరీతి ఘంటా పథంగా చెబుతున్నాయి. పైకి పాకితే ఆమె గొప్పతనాన్ని కీర్తిస్తా. దిగజారితే అవే కారణం అని నిందిస్తాం. " ఎంత





రాసినా, యెంత యెదురు తిరిగినా వేమన మితవాదే – తీవ్రవాదికాదు. దిగంబరుడే కాని దిగంబరవాది కాదు. కొన్ని సాహిత్య మర్యాదల్ని పాటించాడు. ప్రాపంచిక విలువల విలువల్ని కాపాడ్డమే పరమలక్ష్యంగా పెట్టుకున్నాడు వేమన్న. " అని – గన్ను కృష్ణమూర్తి గన్‌షాట్‌గా చెప్పి మనకళ్ళు తెరిపించారు. ఆనాడే కాదు ఈనాడు నవనాగరికంలో వున్నామని మురిసి పోతున్న మనం ఆడవాళ్ళకు సమాన న్యాయం చేస్తున్నామా ? సమాన హోదా వస్తోందా ? క్లబ్బులు, పబ్బులు రెడ్ యేరియాలు యెంత వద్దన్నా పెరిగి పోవటం లేదా ! స్త్రీ విశృంఖలత టి.వి.ల్లో, ప్రసార మాధ్యమాల్లో జుగుప్స కల్గించటం లేదా ! దాన్ని ఖండిస్తూనే వున్నాం కదా ! కల్పనా చావ్లా చేసిన సాహసాన్ని కీర్తిస్తున్నాం. సెరినీ విలియమ్స్ వ్యోమగానాన్ని స్వాగతిస్తున్నాం. ప్రపంచం మొత్తం మీద స్త్రీలు చేసే ప్రతి గొప్పపనికీ ప్రశంసలు లభిస్తూనే వున్నాయి. మహిళా ప్రధానులు, ముఖ్యమంత్రులు, మంత్రులే కాదు మహిళా రాష్ట్రపతి వున్న దేశం మనది. మహిళాభ్యున్నతికి పాటు పడిన వారందరికీ జేజేలు చెబ్తున్నాం. వారికి చట్టసభల్లో రిజర్వేషన్లు కల్పించమని కోర్తున్నాం. వారిలోనైనా, మగవారిలోనైనా లోపాలు కన్పిస్తే సవరించుకోమంటున్నాం. సమసమాజ జీవనాన్ని అందరం కోరుకుంటున్నాం. మహిళా మతల్లుల్లారా వేమన్న స్త్రీ ద్వేషికాదని మళ్ళీ విన్నవిస్తున్నాను.

## సాంఘిక దురాచారాలపై వేమన్న

"హాస్యం పరమౌషధం. దాన్ని రంగరించి అన్నిట్లోనూ కలిపియిస్తే చక్కగా పనిచేస్తుంది. అందుకే వేమన తాను నవ్వు కోటమే కాదు, లోకుల్నీ నవ్విస్తూ హితోపదేశం చేశాడు. సంఘంలో వున్న దురాచారాలను కడగటానికి రేవు పెట్టాడు. మతాచారాలను, అన్ని వర్ణాలవారిని, లోభుల్ని, కవట యోగుల్ని

ఝూడించివదిలాడు. 'పాపమనగ వేరె పరదేశమున లేదు / తాను చేయు పనుల దగిలియుండు " / అని బోధించాడు. స్వార్థ పరుల్ని యెదిరించటానికి హాస్యాయుధాన్ని వాడాడు. మొదట్లో ముతకగా పనసతొక్కంత పెళుసుగావున్నా, రానురాను నాజూగ్గా పనస తొనలంత తియ్యగా కమ్మగా మారింది " అని ఆరుద్ర అన్నమాటలు యదార్థం. బ్రాహ్మణుడు ఉపనయనం చేసుకుంటేనే వేద విద్యాభ్యాసానికి అర్హుడు. బ్రాహ్మణ స్త్రీలకు ఉపనయనార్హత లేదు. అందుకని వేమన 'తల్లి శూద్రురాలు తానెట్లు బాపడో ? " అని ప్రశ్నించాడు । ఇతర కులాలవారికి వేదవిద్య నిషేధం అన్నప్పుడు –ఉపనయనం లేదు కనుక స్త్రీ శూద్రురాలే – ఆమెకు పుట్టినవాడు శూద్రుడే కదా ! అని ఆ వేలితోనే ఆకంటిని పొడిచాడు, 'గుప్త విద్య ఒక్కటే కులకాంత వంటిది ' అని భావించి, దాని ప్రచారానికి దేశమంతా తిరిగాడు. పరిపక్వమైన మనసున్న వారికి కులం, మతం, స్థలం అక్కర్లేదని ఆయన భావం. పెరిగిన వాతావరణం మనిషిని తీర్చిదిద్దుతుంది.

ఆడపిల్లలను అమ్ముకునే 'కన్యాశుల్కం ' అనే దురాచారాన్ని ఖండించాడు. పల్లను అమ్ముకోవటం అంటే, స్వంత కూతురితో వ్యభిచరించటం అంత తప్పు అని గట్టిగా చెప్పాడు. " పేద వాడైననూ పెంటి నిచ్చెదనని / పైడి నడుగరాదు పరుసముగను / పైడి గొనుట పెంటి బట్టి నట్లయా ' అన్నాడు. ఇచ్చిపుచ్చుకొనే వారిద్దరూ గతిలేని వారైతే, యింత తిండి పెట్టి కన్యాదానం చేస్తేచాలు అని హితవు చెప్పాడు " కడివెడన్న మునిడి కన్నసీవలెగాక / పడుపుగూడు గుడువవలదు " అని హెచ్చరించాడు. చేతనైనంత వర దక్షిణ నిచ్చి పేదవానిలో బంధుత్వం కలుపుకోవాలట. "కలిమి జూచి ఈయ కాయమిచ్చినయట్లు / సమున కీయ నదియు సరసతనము / పేదకిచ్చు మనువు పెనవేసినట్లుండు " అని బీదరికంలో వున్న వారితో వియ్యం అందుకుంటే బంధు లాభం, ఆపేక్షలు పెరుగుతాయని పేదలపాలిటి పెన్నిధిగా మాట్లాడతాడు,





మనసు లేని మనువు పనికి రాదన్నాడు, "కలుగు వాడు లేమి కానకిచ్చుమనువు / కలిమి లేములటుల కలిసియుండు / అనటంలో ఆప్యాయతలుండాలని, ధనం అడ్డుకారాదని కోరాడు. కుటుంబ వ్యవస్థ బాగుండాలని ఆశించాడు.

చదువు సంస్కారం తేవాలి. ఒట్టి చదువు వన్నె లేదు. " ఎంత చదువు చదివి ఏ నీతి ఎన్నను / హీను డవ గుణంబు మానలేడు / బొగ్గుపాల గడగ పోవునా మలినంబు / అని మంచి ఉపమానంతో సంస్కారం ఆవశ్యకతను చెప్పాడు. కుహునా మేధావుల వల్ల సమాజానికి కీడని, చిత్తం విత్తం మీద వుండి, కలుషాత్ముడైన వాడెంత చదివినా దాలి గుంటలోని కుక్కలాంటి వాడని నిందిస్తాడు. " చదువు లెన్ని చదివి చాల వివేకియై /కలుష చిత్తుడైన ఖలుని గుణము / దాలి గుంట కుక్కదలచిన చందమూ " / – విద్య నేర్పిన గురుని ఉచిత రీతిలో సత్కరించాలి. కాని రేవు దాట గానే తెప్పను తీగలేసినట్లు విద్య నేర్వగానే గురువుని గౌరవించటం మర్చిపోతారు. వేశ్య కివ్వటానికి డబ్బుంటుంది కాని గురువు కివ్వటానికి సంకోచిస్తాడని అసహ్యించుకుంటాడు. ' ఎన్న గురువు కన్న నెక్కువ లేదయా / అని గురువు గారి గురుత్వాన్ని శ్లాఘిస్తాడు. 'తాళం చెవిలేకుండా తాళం యెట్టారాదో, గురుని శిక్షలేక గురుతురాదంటాడు. గురువులు కూడా విద్యా గురువులు, మిధ్యాగురువులు అని రెండు రకాలు. 'కస్తూరి నల్లగా వున్నా, దాని పరిమళం పరిఢవిల్లినట్లు మంచి గురువు లైనవారి గుణాలుంటాయట.

"వైద్యో నారాయణో హరి : " అని భావిస్తాం. సాక్షాత్తు నారాయణ స్వరూపుడే వైద్యుడు. ఆయన భవ వ్యాధి నివారణ చేస్తే, యీయన యిహవ్యాధి నివారణ చేస్తాడు. అందుకే వైద్యులను " వ్యాధి నెరిగినట్టి విశ్వోపకారులు " అని కీర్తించాడు. ప్రాణ దానం చేస్తాడు వైద్యుడు. ఇది అన్ని దానాలలో మిన్న యైన దానం. రోగం ముదరక ముందే చికిత్స చేయాలని వైద్యులకూ బోధించాడు

అందుకే "కూలబడిన నరుడు కుదురుట అరుదయా / అన్నాడు. రోగం యేమిటో తెలిసికోలేని వైద్యుడు శుద్ధ దండగ అన్న విషయాన్ని " వ్యాధి నెరుగలేని వైద్యుడేల ?" అన్న మాటలో చెప్పాడు.

చిన్న వాడైనా తగినట్లు ప్రవర్తించినా, మాట్లాడినా అతన్ని ఆదరించి గౌరవించాలి. అక్కడ చిన్న, పెద్ద తేడా చూడరాదు. చిన్న దీపం పెద్ద కాంతినిస్తుంది కదా ! " అంకి లెరిగి మాటలాడ నేర్చిన యపుడు / పిన్న తనము పేర్మియేల / పిన్న చేతి దివ్వె చేతి దివ్వె పెద్దగా వెలగదా ? " అని ప్రతిభకు పట్టంకట్ట మన్నాడు. కౌరవ సభలో కర్ణుడి కుమారుడు యిలానే మాట్లాడితే, ప్రశంసించారు.

వివాహాది శుభకార్యాలకు జ్యోతి షం చూడడం, ముహూర్త నిర్ణయం, శకునాలు, మొదలైన వాటిపై వేమన విమర్శలు సంధించాడు. ముహూర్తాన్ని మంచిదిగా ఎన్నుకొని పెళ్ళిచేసినా వైధవ్యం యెందుకు వచ్చిందంటాడు ? " విప్రులెల్ల గూడి వెర్రి కూతలు కూసి / సతిపతుల గూర్చి నమ్మతమున / మునుముహూర్త ముంచ ముండెట్లు మోసెరా ? " అని నిలదీస్తాడు, జ్యోతిష్యాన్ని అతిగా నమ్మి మోసపోవద్దని చెప్పాడు. శకునాలకు అవకాశాలివ్వద్దంటాడు. పాలపక్షి మంచి శకునం అని నమ్ముతారు. శకున ఫలం దానికే తెలుసు పొమ్మంటాడు, " తనదు మేలు కీడు తనలో నె యుండక ' ఎన్నోచూసి, మోసపోవద్దని సలహా, శకునం మంచిదైతే సరే, కాకపోతే ? ' కాని పనులకు తమ కర్మమంటారు " అన్నాడు. అన్ని వారాలు, అన్ని రోజులూ మంచివే అని తీర్పుయిస్తాడు. " న్యాయశాస్త్ర మరయ నన్యాయ మొనరించు / ధర్మ శాస్త్ర మొనంగు దుర్మతంబు / జ్యోతిషంబుజనుల నీతుల దప్పించు / అని మెత్తగా చివాట్లు పెట్టాడు. అతిగా దేన్ని నమ్మద్దు. నీమనస్సే నీకు మంచి చెడు చెప్తుంది. దాన్ని నొక్కేసి యితరులపై ఆధార పడవద్దు. వివేకం, విజ్ఞానంతో ప్రవర్తించు.





దేని కోసం యెదురు చూడద్దు అంటూ " రానిది కోరిన రాదది / రానున్నది కోరుకున్న రానేవచ్చున్ / తానెంత చింతజేసిన / కానున్నది కాకపోదుగదరా వేమా / " – దయతో ప్రవర్తించాలి. సానుభూతి చూపాలి. 'ముష్టి వేపచెట్టు మొదలుగా ప్రజలకు / పరగ మూలికలకు పనికి వచ్చు / నిర్దయాత్మకుడు నీచు డెందునకును /పనికిరాడు గదర పరగ వేమ / అని నిర్దయుణ్ణి, దయాహీనుణ్ణి గూర్చి చెప్పాడు.'

## వేమన సార్వకాలీనత

దేశ, కాలాలకు అతీతంగా చెప్పేది సార్వకాలీనం. సత్యం ఒక్కటేనని నమ్మి, దాని సర్వ వ్యాప్తిత్వాన్ని ఆవిష్కరించారు వేదాంతులు, దాంతులు, దార్శనికులు. 'బహుజన హితాయ, బహుజన సుఖాయచే ' అన్నదే వారి లక్ష్యం. 'తత్వమసి' అన్నది ఛాందోగ్యోపనిషత్ సారాంశం. 'తత్' అంటే 'అది ' అని, 'త్వం' అంటే నీవు అని, 'అసి' అంటే అయి వున్నావు అని అందరికి తెలిసిందే. అంతా ఒక్కటే, పరబ్రహ్మ స్వరూపమే. ఇందులో ఆత్మజ్ఞానం, ప్రపంచ జ్ఞానం, బ్రహ్మజ్ఞానం కలిసి వున్నాయని శ్రీ అరవిందులు వివరణనిచ్చారు. బ్రహ్మ, ప్రపంచం, నువ్వు ఒక్కటేనని అర్థం. 'సోకామయత ఏకోహం, బహుస్యాం ప్రజాయేతి' అన్న ఉపనిషద్వాక్యం కూడా విశిష్టతను సంతరించుకొంది. భగవంతుడు తాను అనేకంగా మారి ఆనందిస్తాను అనుకొన్నాడని భావం. మనలోని బ్రహ్మ పదార్థం బయటకు వచ్చి ప్రకటింపబడ్డప్పుడే భగవంతుడుతాను అనేకంగా మారి ఆనందించాలనే సంకల్పం నెరవేరుతుంది. అంటే బ్రహ్మగా మారే ప్రయాణంలో వున్న మానవుడివి. మానవుడిగా కనిపించే బ్రహ్మవే నీవు. కనుక భగవంతుణ్ణి జీవితంలో అభివ్యక్తం కానివ్వటమే మానవ జీవిత పరమార్థమని అరవిందుల యోచన. ఈ భావనవస్తే ద్వంద్వం లేదు. అంతా

భగవదంశలానే తోస్తుంది. మనం బ్రతికేది అందరి వికాసానికి అన్న స్పృహ చాలా అవసరం. మనం పడే వేదన, బాధ కష్టం, కన్నీళ్ళు అన్నీ, రాబోయే మహా మానవుణ్ణి ప్రసవించే దిశగా పుడమి తల్లి పడుతున్న ప్రసవవేదనలే అని తెలిస్తే బ్రతుకు ఆనందంగా, హాయిగా సాగిపోతుందని అరవింద తత్వ రహస్యం.

విశ్వాన్ని గురించో, శాశ్వత వస్తువు గురించో, దాని ఆధారం గురించో, తనను గురించో ప్రత్యక్ష అనుమానాలపై ఆధార పడకుండా చింతన చేస్తే, అది ఫలించి, మంచి భావంతో ఆవిష్కరింప బడినది 'దర్శనం' అంటాం. ఆ చింతన చేసిన వారు దార్శనికులు. అనుభూతి, చిరంతనమననం, విశ్లేషణ ద్వారా శ్రద్ధను నిర్మిస్తే ఆ దర్శనం పరిపూర్ణం. 'దృశ్యతే అనేన ఇతి దర్శనం' దేని వల్ల చూడబడుతుందో అది దర్శనం. దేన్ని చూడాలి? సత్యాన్ని. అడ్డంకుల్ని, పరిమితుల్ని అధిగమించి, వివిధ అనుభవాల, శాస్త్రాల, సంస్కృతుల, సిద్ధాంతాల మధ్య సంబంధాలను స్థాపించి విశ్వ దృష్టిని కల్పించటం దర్శనం కోరే మహదాశయం. ఆ విశ్వ దృష్టిలో చెప్పిన ప్రతి మాట మానవాళికి శిరోధార్యం. వివిధ వాదాలు, శాస్త్రాలు ఆధారంగా సత్యాన్వేషణ జరుగుతుంది. అతీంద్రియ దృష్టి, రుషిత్వం, తపస్వాధ్యాయనం వున్న మహానుభావులకు యివన్నీ మనోఫలకం పై ఆవిష్కారం జరుగుతాయి. వాటిని మానవాళి అభ్యుదయానికి తేలిక మాటల్లో హృదయానికి గాఢంగా హత్తుకునేట్లు చేస్తారు యోగులు, మనీషులు. అలాంటి దార్శనిక దృష్టి వున్న వేమన చెప్పిన మహా వాక్యాలను మననం చేద్దాం. వాలి సార్వకాలీనత్వానికి ముచ్చట పడదాం. ఆయన సాధించిన ఆత్మ పరిణతికి నివాళులిద్దాం. నిజం తెలుసుకుందా. ఆ ఎరుక తెలిస్తే అంతా ఆనందమయమే, శాంతి ధామమే.

'అజ్ఞానం శూద్రత్వం, సుజ్ఞానం బ్రహ్మం' అని శృతి చెప్పిందన్నారు వేమన. 'ఇంద్రియ జయుడే వుత్తముడు. తన గుణాన్ని తెలుసుకోకుండా యితరుల





గుణాలను యెంచేవాడు భ్రష్టుడు,' 'జీవ భావమెరుగ జెడదెన్నటికి మది/దైవమును నెరుగ దనరు బుద్ధి/ తేజయు దయ యందు దిమిరంబు నిల్వదు/ 'జ్ఞానం కలిగితే అజ్ఞానం చీకటి నిలవదని తాత్పర్యం. 'జ్ఞానం, సత్యం తెలిస్తేనే ద్విజుడవుతాడు' 'నిశ్చలాత్మయున్న నిర్వికారంబున/ ముక్తి యంద్రు దాని మొగిని వేమ/ నిశ్చలమైన అంత:కరణముటే అదే ముక్తి. 'ఇంద్రియాలను రోసి ఈశ్వరుణ్ణి చూడ' మన్నాడు. బ్రహ్మాన్ని గురించి ఆలోచన చేస్తే ఏం లాభం లేదు, " తనువు గుడిగ జేసి తన్ను నిలిపి / లోక బుద్ధి విడిచి లో జూపు చూడరా/ అని చింత హృదయగతం కావాలన్నాడు. శాస్త్రాలతో సంశయం తీరదు. స్వానుభూతి చేతనే సాధించగలం. కోపం, రోషం, అవేశ, వావేషాలు, సంతోషలనివ్వవు. ధర్మరాజు విజయ రహస్యం శాంతం. సకల కార్యాలు శాంతం వల్లనే సాధ్యం. సంతోషం కల్గి సత్యమేవ జయతే అవుతుంది. 'ఆరు రుచులు వేరే అయినా సారం ఒక్కటే. సత్యాన్వేషణ మార్గాలు వేరైనా సత్యం ఒక్కటే. పరమరుషులు వేరు భావ్యుడొక్కండురా" అని సత్య దర్శనం చేయించాడు. ప్రకృతిని తెలుసుకోవాలి అది తెలియక పోతే భక్తి కానే కాదు. భగవంతుణ్ణి చూడాలంటే" చూచు కనులు వేరు, చూపువేరు/ చూపులోన, మరిచి చూడాలి" అప్పుడే దర్శన సాధ్యం కల్గుతుంది. ఎంత విద్య నేర్చినా, తనతో పాటే మన్ను అయిపోతాయి. "దేవుడు ఆత్మలోన నుండు ననగి పెనగి" / దాన్ని దర్శించాలి. సర్వానికి ధర్మమే మూలం. "ధర్మమే నృపులకు తారక యోగంబు" అన్న సార్వకాలిక సత్యం చెప్పాడు.

"విను వివేక మనెడి వింత గొడ్డలి చేత/ వలయు విద్య యనెడు నడవి నరికి/ తెలివి యనెడు గొప్ప దీపంబు చే బట్టి/ ముక్తి జూడవచ్చు మొనసి వేమ" – ముక్తికి మార్గం వివేకం, విద్యారణ్యాన్ని ఛేదించాలి. తెలివి అంటే పరమేశ్వర జ్ఞానం అనే దీపంతో వతికితేనే మోక్షం. ఈ శరీరం మట్టి కుండ. శిధిలమయేది. ఆత్మకు చావులేదు. ఎన్ని కుండలునా& అందులో ప్రతిఫలించేది ఒకటే

ఆకాశం.'ఎఱుక సాటి యెఱుక యే తత్వమున లేదు'అని ఆత్మజ్ఞానం రహస్యం వివరించాడు. గురువు చిల్ల గింజ దేహం కుండ. ఆత్మ కలుషిత నీరు. ఆ నీటి గురువనే చిల్లగింజ గంధం కలిపితే, మాలిన్యాలన్ని అడుక్కు చేరి స్వచ్ఛ సత్య పరమాత్మ దర్శనం కల్గుతుంది. ఇది తెలిస్తే దివ్యామృతమే అంటాడు. 'పశుల వన్నె వేరుపాలేక వర్ణమౌ/ పుష్ప జాతి వేరు పూజ యొకటి/ దర్శనంబు వేరు దైవంబదొక్కటే/ అని ఏ రీతిలో కొల్చినా, ఏ భావన చేసినా చేరేది పరమ పదమే. చిత్తం అనే వేరు శిధిలమైతేనే శక్తి అనే చెట్టు కూలిపోతుంది. అప్పుడే కోరిక లనే పెద్ద కొమ్మలు ఎండిపోతాయి. కనుక చిత్తాన్ని శిధిలం చేసుకోవాలి.

మనిషి దేవుడుగా మారటమే మానవ జీవిత లక్ష్యం. అది సాధిస్తే యింకేమీ అక్కరలేదంటూ "సొమ్ము దొరకు దనుక జ్యోతి యంతియె కాక / సొమ్ము దొరకు వెనుక జ్యోతి యేల/ దేవుడైన వెనుక దేహంబు మరియేల? అని ప్రశ్నించాడు. ఆత్మ బుద్ధి వుంటే అంతా తాను గానే కన్పిస్తుంది.చెట్టులో అగ్ని దాగి వుంది. కాని అగ్నిలో చెట్టు బతకలేదు. చెట్టులో వున్న అగ్ని లాంటి వాడు సంసారి. ఆశ వదిల్తే బంధం పోతుంది. బంధంపోతే ముని అవుతాడు. ముని అయితే సర్వ మోహాలు పటాపంచలవుతాయి. 'ఆత్మలోన నాదమాలించి మాలించి/ నప్పుడే తత్వజ్ఞాని అవుతాడు. త్రిగుణాలు నశిస్తే ముక్తి ఖాయం. తోలు తిత్తి యిది తూటులు తొమ్మిది, తుస్సు మనటం ఖాయం.దీన్ని నమ్ముకోకు. బ్రహ్మాన్ని తెలుసుకో అన్నాడు'. 'నాశిక మధ్య నను జూచు యోగి/కాశి నాధునైన గన గలడాయోగి/ అని సాధన రహస్యం చెప్పాడు. కనుచూపు భ్రూ మధ్యంలో వుంచి, తరచి తెరచి చూస్తే ఆత్మ రాక పోకలన్నీ తెలుస్తాయని విశ్వాసంగా చెప్పాడు. "బ్రహ్మ మనగ వేరె పరదేశమున లేదు/ బ్రహ్మ మనగలినె బట్ట బయలు/ తన్ను దానెరిగిన తానె పో బ్రహ్మంబు" అని బ్రహ్మోపదేశం చేస్తాడు.





'అణువులో అఖిల జగాలు వున్నాయి. ఆ అణువులో మనలోనే అణగి వుంది. మనసు నిలిపితేనే ముక్తి సాధ్యం' అని స్థూల, సూక్ష్మ జగతిని గురించి చెప్పాడు. ' చేతిలో వెన్న వున్నా, నెయ్యి కోసం వెతికే మూర్ఖుడు మానవుడు–' తాను దైవమయ్యు, దైవంబు తలచును. శివోహం – నేనే పరబ్రహ్మాన్ని అన్న విషయం మర్చిపోతున్నాడని జాలి పడ్డాడు. "తనువు లేనివాడు తానెతానేనయా ' – శరీర భ్రాంతి విడిచేస్తే 'సోహం'భావం, దానితో ముక్తి. 'తాను సకలమైన దనలోన సకలంబు / తనదులోన వెలుగు తానెరింగి / యున్న మానవునకు నొన రంగముక్తిరా / అన్ని ఈశ్వర వ్యాపకం జగత్తంతా నిండివుందని కమ్మగా, నమ్మకంగా ఉపనిష ద్రహస్యాన్ని విప్పి చెప్పాడు. ' ఆకృతి అంటే నిరాకృతే. ఆ రెండూ అపురూపాలే నంటాడు. లోపలి దృష్టి వుంటే లోకం అంతా అభిరామంగా కన్పిస్తుంది – బయటి దానికి మురిసిపోతే బంధనమే. 'తన్ను జూడజూడ తారక బ్రహ్మంబు ' అని రహస్యాన్ని ఛేదించాడు. విత్తనాన్ని భూమిలో నాటితే, పై పొట్టు వూడి మొలకగా బయటపడినట్లు 'వేత్తయగు వాని కర్మం / బత్తెరగున విడిచిపోవునను వునవేమా ! " అన్నాడు. మాయ పొర వదిలితే అంతా చిదానందమే. ఎన్నో భోగాలు చుట్టూవున్నా, యోగి కర్మచయాన్ని అంటకుండా తిరుగుతాడన్నాడు. అన్నానికి అంటూంటే ఆత్మకీ వుంది. ఆత్మ శుద్ధి వుంటే అన్న శుద్ధి వుంది. కనుక ఆత్మ మిన్ను, మన్నులాగ మెరుస్తుంది. శతృవంచకాన్ని జయించి, కామ వాసన వర్జించి, శివ పంచాక్షరి జపిస్తే, పంచత్వం నశించి, శివుని పంచచేరి పరుడౌతాడు. 'ప్రవణ మరయలేక భక్తుడు కాలేడు / జ్యోతి నరయలేక జోగికాడు / నిత్య మరయలేక నిర్వాణి కాడయా / అని ముక్తికి సోపానాలు చెప్పాడు . " సూక్ష్మ మధ్యమంలో జీవుడు, స్థూల మద్యమంలో సూర్యుడు, నాదబిందు కళల మధ్య బ్రహ్మమూ వుంటారని వివరిస్తాడు. ఆసనాలు, యోగాలు బాహ్యడంబరాలే – అవన్నీ సాము గరిడీలకంటె చింతా కంత తక్కువ.

నీటి మీద బుడగ జీవితం. దాని సోకుచూసి మోసపోకు, జీవితం విరిగి పోయె పచ్చికుండ – దానికోసం భ్రాంతి అనవసరం. మనం మాట్లాడే ప్రతిమాట పరమేశ్వరుడికి తెలుసునంటూ "నీవు పలుకు పలుకు నిర్మలుండెరుగురా ! " అని హెచ్చరించాడు. ఎవరూ వినరని, మనం యిష్టం వచ్చినట్లు మాట్లాడ కూడదని భావం. ఆపైవాడికి చూపూ, వినికిడీ వున్నాయి. సర్వసాక్షి ఆతడు అని అనుక్షణం గుర్తుంచుకోవాలి. 'ప్రాణ మిలను లేక పరమందగారాదు / ప్రాణముండగానె పరము గద్దు / ప్రాణం వుండగానే మద్దైనా సాధించాలి. అందుకే 'ప్రాణి పోయినపుడు పనికి రాదీ దేహము / అని గట్టిగా చెప్పాడు. శరీరం ధర్మ సాధనం అన్నీ ఆర్యోక్తికి చక్కని వుదాహరణ కదా ! పరతత్త్వయోగి తత్వమేమిటో యిలా వివరించాడు "మనసు హక్కు కర్మమని యేమిలేకయ / రాక పోక లేని రాజవీధి / పరగహాని గలదె పరతత్త్వ యోగికి ? " నిర్వికారంగా, నిర్భంధంగా చరించే వాడికీ నిబంధనలు వర్తించవు. జ్ఞానముద్ర చేత తళుకు కనిపిస్తుంది. అదే మనసుకు శ్రేష్టం అని మునులు చెప్పారు. ఇది తెలిస్తే పరమార్థం తెలిసినట్లేనని వివరించాడు వేమన. ఎంతోగహనమైన వేదవేదాంగ, ఉపనిషత్, శాస్త్రి, యోగ విషయాలను, దర్మన సూక్ష్మాలను అలవోకగా, హాయిగా తేటతేట పదాలు ఆటవెలదుల్లో కూర్చి జ్ఞానబోధ చేశాడు. ఇవన్నీ సార్వకాలిక సత్యాలే.





# సామెతల ఆమెతలు

వేమన అనగానే యేదో పద్యం గుర్తుకొస్తుంది. సందర్భానుసారంగా సామెతను వాడటం తెలుగు వారి ప్రత్యేకత. మనం వాడే సామెతల్లో చాలా భాగం వేమన చెప్పిన పద్యాలే. అంతగా ఆయన మన జనజీవనంలో మమైక మయ్యారు. కనుక తెలుగింట ఆయన సామెతల ఆమెతలు నిత్యం తృప్తిని సంతోషాన్నిచ్చి, భావపుష్టిని, ఆరోగ్యపు ఐశ్వర్యాన్నీ కల్గిస్తాయి. ఇంతకీ సామెత అంటే ? లోకోక్తి. అంటే ప్రజల వాడుకలోని నీతి, అనుభవం మొదలైన వాటిని తెలిపే వాక్యం లేక పదాల సముదాయం. మరి ఆమెత ఏమిటి ? ఆమెత అంటే విందు, భోజనం. నిత్యం వేమన వాక్యాలను నెమరేస్తూ విందు భోజనం చేసి ఆనందించటమే సామెతల ఆమెతలు. విందులే విందులు. ఆనందపు చిందులే చిందులు. అందులో మొట్టమొదటిది 'ఆత్మ శుద్ధిలేని యాచారమనియేల / భాండశుద్ధిలేన పాకమేల / చిత్తశుద్ధి లేని శివపూజలేలరా / ఈ మూడిటిని మూడు ప్రత్యేక సందర్భాలలో సామెతల్లా వాడని వారున్నారా ? వేరుపురుగు వృక్షాన్ని, చీడపురుగు చెట్టును చెరచేటట్లు, 'గుత్సితుండు చేరి గుణవంతుజెరచురా ' / అన్నది అంతా చెప్పేదే – చెడు స్నేహం పనికిరాదని హెచ్చరికగా. "నీరు పల్ల మెరుగు నిజముగాను / తనయుని జననంబు తల్లి తానెరుగును / అంటాం నిజమేదో, అబద్ధమేదో తెలియని సందర్భంలో, స్థాన బలిమి చాలా గొప్పది. తనకు బలంలేని చోట, పరుల బలం బలంగా వున్నచోట విర్రవీగటం మంచిది కాదు. అప్పుడు తగ్గి వుంటే మనకు పోయేదేం లేదు – మన పరిస్థితి మారదంటూ నీతిని బోధిస్తాం. " అనువుగాని చోట నధికులమనరాదు / కొంచెముండుటెల్ల కొదుదగాదు / కొండ యుద్ధమందు గొంచెమై యుండడు / అన్న పద్యంయెంతో స్ఫూర్తిదాయకం. అలాగే కీడు చేసినవాడికీ మేలు చేయటం మనకు అనాదినుంచి

వస్తున్న ఆచారం. భారతంలోనూ చెప్పిన నీతి. దీన్ని సూక్ష్మంచేసి వేమన్న 'చంపదగిన యట్టి శత్రువు తన చేత / జిక్కెనేని కీడు సేయరాదు / పొసగమేలు చేసి పొమ్మనుటే చాలు " అని పాటించ దగు నీతిని, లోక రీతిని చెప్పాడు. డబ్బా కొట్టేవాడు అప్పుడూ యిప్పుడు యెప్పుడూ వున్నారు. మంచివాడు వొదిగి వుండి మాట్లాడతాడు. ఇద్దర్నీ పోలుస్తూ "కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా ? " అంటూంటాం. సూటి పోటీ మాటలతో మనసులు విరిగిపోతాయి. ఇనుము విరిగితే కాల్చి అతికించవచ్చు. మనసు విరిగితే అతకటం అసాధ్యం – " మనసు విరిగెనేని మరియంట నేర్చునా ? " అని లోకోక్తి చెప్తాం. " మేడిపండు జూడ మేలిమై యుండును / పొట్టవిచ్చి చూడ పురుగులుండు / బెరుకు వాని మదిని బింక మీలాగురా / " పైకి పటారం, లోన లొటారం గాళ్ళ నిజరూపం బయట పడెయ్యటానికి వాడే సామెతయిది. తల్లి దండ్రుల్ని ఆదరించలేని కొడుకులను చూసె 'తల్లిదండ్రిమీద దయలేని పుత్రుండు /' పద్యం చదివి జ్ఞానబోధ చేస్తాం. ఆలోచనను కార్యసాధనం లోకి మార్చాలి. అది తీవ్రమైతే పనులన్నీ లాభిస్తాయి. అందుకే వేమన " అనగననగ రాగమతి శయిల్లుచునుండు / తినగ దినగమేము దేయనుండు / సాధనమున పనులు సమకూరుధరలోన అని కమ్మగా చెప్పాడు. సంగీతం కష్టమే. నిత్య సాధనతో రాగం దారికొస్తుంది. వాము చేదుగానే వుంటుంది. తినటం ప్రారంభిస్తే తీపి అనిపిస్తుంది. కనుక పని సాధించాలంటే నిత్యసాధన, కావాలి. కష్టాలు వచ్చాయనో, సరిగా రావటం లేదనో నిరాశ చెంది వదిలి పెట్టకూడదు – ఆనాడూ, యీనాడూ, ఏనాడూ యిది ఆచరన యోగ్యమైనమాట. "ఎలుకతోలు తెచ్చి యేడాది నుతికిన / నలుపుగాక యేల తెలుపుగలుగు " అన్నిదీ బుద్ధి మారని వారిని గూర్చి అనటం మామూలే. 'కుక్కతోక బట్టి గోదావరీదటం ' కూడా ఎక్కువ వాడుకలో వుంది. 'గంగిగోవుపాలు గరిటెడైననుజాలు / కడివెడైన నేమి ఖరము పాలు / భక్తి గలుగుకూడు పట్టెడైనను





జాలు " పద్యాన్ని మన జీవితంలో యెన్నిసార్లు వుపయోగించి వుంటామో ఆలోచిస్తే మనకే ఆశ్చర్యమేస్తుంది. ఆంధ్రుల మనసుకి, శరీరానికి, శల్యగతంగా పట్టిన పద్యమిది. శ్రద్ధ, భక్తిలేకయే పని చేసినా ఫలితం లేదు. భగవంతునికి కొండంత పత్రి, నైవేద్యాలు అక్కర్లేదు. పట్టెడన్నం పవిత్రమైన మనసుతో సమర్పిస్తే విపరీతమైన ఫలితం కలుగుతుంది. రంతి దేవుడు, ద్రౌపతి యిలా చేసే చరితార్థులయారు. సరైన వాడిని సరైన స్థానంలో కూర్చోబెట్టాలి. ప్రలోభాలకో, పైరవీలకో లొంగి అధికారం అనర్హుడికివ్వరాదు.

అలాచేస్తే చెప్పు తినే కుక్కకు చెరకు రసం తీపి తెలియనట్లుంది. " అల్ప బుద్ధి వాని కధికారమిచ్చిన / గొడ్డ వారినెల్ల దొలగగొట్టు / చెప్పుతినెడ కుక్క చెరుకు తీపెరుగునా ? " అని నేటి రాజకీయ పరిస్థితిపై బాధపడుతు, చీదరించుకుంటూ అంటూ వుంటాం. కాని జరిగేదేదో జరిగి పోతూనే వుంటుంది. కులం, మతం, భాష, బంధుత్వం, ఆశ్రిత పక్ష పాతంతో అర్హులు పదవులకు దూరమై పోవటం చూస్తూనే వున్నాం. ఏం చేయలేక వేమనపద్యాలు చదువు కుంటూ, గొణుక్కుంటూంటాం. అవతలివాడిలో తప్పులు వెదికే రంధ్రాన్వేషకులు సమాజంలో యెక్కువ. తమ తప్పు మాత్రం తెలుసుకోలేరు. " తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు " అని అంతా గుర్తుంచుకోవాలి. ఒక వేలు అవతలి వాడి వైపు చూపిస్తే, నాలుగు వేళ్ళు మనవైపు చూపిస్తూంటాయని యేసుక్రీస్తు చెప్పిన మాట మరువరాదు. మహిమ, ప్రతాపం లేని దేవుణ్ణి, వీరుణ్ణి కొలిస్తే యేమీ జరగదు. "మహిమ లేని వేల్పు మంటి జేసినపులి " రాజు చాలా తెలివిలో ప్రవర్తిస్తాడు. ఆశ్రతులయడ ఆదరంగా, దయగా వున్నట్లే వుంటాడు – యేమాత్రం తప్పు చేసినా చంపేస్తాడు. " పట్టనేర్చుపాము పడగ నోరగజేయు / చెరుప జూచువాడు చెలిమిచేయి / చంపదలచురాజు చనువిచ్చి చూడడా " అని లోకోక్తి రాజబాధ అనుభవించిన వారిపట్ల వాడుతాం, దానం చెయ్యమని లోభివాడి

దగ్గర కెడితే గొడ్డుటావు దగ్గరకి పాలు పిండటానికై వెళ్తే, యీడ్చి తన్నినట్లుంటుందని సామెతను మహాగొప్పగా చెప్పాడు. దీన్ని మన నాలుకపై నిత్యం నర్తింపజేస్తూంటాం. "గొడ్డుటావు బితుక కుండ గొపోయినా / పండ్లు నూడదన్నుబాలురావు / లోభివానినడు గలాభంబులే దుర్గా ". చావు తెలివి కావాలి, రావాలి. మిగతాది యెంత చదివినా వృధా అందుకే " చావు తెలియలేని చదువులదేలరా / అంటాం. చావు తెలివి అంటే చావును గురించిన జ్ఞానం. అది తెలిస్తే బ్రహ్మజ్ఞానే. మిగతా చదువులు కూడు, గుడ్డ పెడ్తాయి కాని, పరాన్నివ్వవు. అయితే యిప్పుడు లోకంలో చావు తెలివి ' అంటే పనికి రాని తెలివితేటలు అన్నీ అర్థం రూఢి అయిపోయింది. బలంలేని సమయంలో బలహీనుడు కూడా బలవంతుణ్ణి వోడిస్తాడు. అందుకే 'బలిమి లేని వేళ బంతంబు చెల్లదు ' అని సామెత వాడుకలోకి వచ్చింది. సింహం బక్క చిక్కితే బక్క కుక్క కూడా దాన్ని యిక్కట్ల పాలు చేస్తుంది కదా ! ముండనం చేయించుకొని కాషాయాలు కట్టుకున్నంత మాత్రం చేత సన్యాసికాదు. అందుకే "తలలుబోడులైన తలపులు బోడులా ? " అన్న లోకోక్తి ప్రచారమైంది దొంగ సన్నాసులవల్ల.

వేమన సూక్తుల్లో, లోకోక్తుల్లో, సామెతల్లో అందరం వాడుతూ వుండే ముఖ్యమైన పద్యం "ఉప్పు కప్పురంబు ఒక్క పోలిక నుండు / చూడ చూడ రుచుల జాడవేరు / పురుషులందు పుణ్యపురుషులు వేరయా ' అన్నది. పైకి అంతా ఒకటి గానే కన్పిస్తారు. దాన్ని చూసి మోసపోరాదు. ఆంతర్యం చాలా ముఖ్యం. పుణ్యపురుషులు, మహాత్ములు కర్పూరంలా కరిగిపోతారు. ఆత్మ త్యాగంతో నీరాజనాలందు కొంటారు. ఉప్పులాగ ఉప్పగా వుంటారు సామాన్యులు. అలాగే శరీరాన్ని, కుల, మతాల్ని బట్టికాక మనసును బట్టి విలువ నివ్వాలనే విషయంలో "మిరప గింజ చూడ మీద నల్లగ నుండు / కొరికి చూడలోన చురుకు మనును / సజ్జనులగు వారి సార మిట్టులనుండు / అని సజ్జన సాంగత్య





విషయంలో పోలిక చెప్తాం. పెత్తనం యిస్తే పరాయి సొమ్ము కాజేసే ప్రబుద్ధుల్ని చూసి " ఎదుటి వారి సొమ్ము ఎల్లవారికి తీపి " అంటాం కదా ? కులం గొప్ప, గోత్రం గొప్ప, విద్య గొప్పలను ప్రగల్భాలు పలికే కుహనా సంస్కారులనే వారిని గురించి యీసడించుకుంటాం. ముఖం మీదే అనేస్తాం వేమనలాగ "కులము గల్గువారు గోత్రము గలవారు / విద్య చేత విర్రవీగువారు / పసిడి గల్గువాని బానిస కొడుకులు / అని చీదరిస్తాం. తనకు తెలిసిందే సర్వస్వం అని, తనకు తెలియందేది లేదని భావించే అల్ప మనస్కులు " బావిలోని కప్ప పరికించునెజగంబు " లా గిరిగీసుకొని, అదే ప్రపంచం అన్నీ చందంగా వర్తిస్తారని పోలుస్తాం. చంపదగిన యట్టి శత్రువు తన చేత జిక్కెనేని మేలు సేయవలయు నన్న ఆదర్శం కావాలి. అంతేకాని 'ఒకరి మేలు చూడ నొల్లక యితరుల / చెరుపదలతు వేని చెడిదేవీవు / జింక జంప గుఱ్ఱ జేసి నక్కయె జచ్చె " అని పంచతంత్ర కధను వేమన భావంగా చెప్పి హెచ్చరిస్తాం. అర్థాంతరంగా ఆస్తివస్తే వాడు గర్వంతో ప్రవర్తిస్తూంటే " కలిమి హెచ్చెనేని కనులు నెత్తికి వచ్చు " అని లోకోక్తి చెపుతాం. కళ్ళు నెత్తికి రావటం అన్నమాట జనసామాన్యంలో పాతుకుపోయిన వేమన్న మాట. అడ్డూ అదుపులేక విచ్చల విడిగా తిరిగే వాణ్ణి చూసి జాగ్రత్తగా వుండమని " విచ్చలవిడిగా విరుగుట / చిచ్చునబడునట్టి మిడుత చెలువమె వేమా ! " అని హెచ్చరిస్తాం. ముందే ముందో తెలీక కళ్ళుమూసుకొని తిరిగే మిడుత అగ్ని ఎదుటవున్నా తెలీక దూకి చస్తుంది. అలా కావద్దని చెప్తాం కదా ! లోభివాడి వర్తనపై అసహ్యించు కోవటం లోక సహజం. దీనితోపాటు 'లోభివాని నడుగ లాభంబు లేదంటూ అనీ చురక వేస్తాం. ఆప్యాయంగా, ప్రేమగా పెట్టని కూడు పిండాకూడని తిరస్కరిస్తాం. కులాన్ని కోరేవాడు ' కులహీనుడగునయా / అని కులగజ్జి పనికి రాదని ఆనాడే చెప్పాడు. ఆచారాలు, బయటి వేషాలు మోసాలే. ఆత్మ ప్రక్షాళనం అయితేనే ముక్తిం. అలాంటి వారి

గురించి " కుక్క సింహమగునె గోదావరికి బోవ ' అని వేమన మాటను గుర్తుచేస్తాం. ఇలా మన నిత్య వ్యవహారంలో, పనుల్లో పాటల్లో, ఆలోచనల్లో, ఆచార వ్యవహారాల్లో, భావనల్లో, బాంధవ్యాలలో, వున్న వైరుధ్యాల్ని, స్వోత్కర్షల్ని, తేడాల్ని బేరీజు వేస్తూ, వేమన సూక్తుల్ని సామెతలుగా విసురుతూ, మనమేదో గొప్ప అని పెచ్చరిల్లుతాం – రెచ్చిపోతూంటాం. ఆయన చెప్పినవన్నీ మనకూ వర్తిస్తాయన్న నిజాన్ని మర్చిపోరాదు. ఇంత సుష్పంగా సామెతల ఆమెతలనిచ్చి అను విందుభోజనం కల్పించాడు యోగివేమన. యోగులకు అసాధ్యంలేదు. ఇదంతా భరద్వాజ విందుగా జీర్ణించుకుందాం. ఒక్క సందర్భంలో నైనా మనం మారి యితరులకు మార్గ దర్శకత్వం చేద్దాం. వేమన్న ఆశించిందాన్ని నిజం చేసి. పురుషులందు పుణ్యపురుషులు వేరని నిరూపిద్దాం.

## " ఇతిహాస పౌరాణికాంశాలపై వేమన భావన "

ఆదికవి వాల్మీకి వ్రాసిన శ్రీమద్రామాయణం ఆది కావ్యం. రామచరిత్ర కనుక ఇతిహాసం. కృష్ణ ద్వైపాయనుడైన వ్యాస మహర్షి వ్రాసిన మహాభారతము కూడ భరత దేశాల్ని పరిపాలించిన రాజవంశాల చరిత్రే కనుక ఇతిహాసం. వ్యాసుడే వ్రాసిన శ్రీకృష్ణ లీలా విలాసమైన శ్రీమద్భాగవతం, మత్స్య, కూర్మ వగైరాలన్నీ పురాణాలు. 'ఇలా జరిగి వుంది ' అని చెప్పింది. ఇతిహాసమని, పాతదైనా కొత్తగానే వున్న దాన్ని పురాణ మనీ అంటాం. ఈ రెండింటిలోని విషయాలపైనా వేమన దృష్టి సారించాడు. వాటిలోని విషయాలపై సూక్ష్మ పరిశీలన చేసి, వాటి అసలు రహస్యాలను వివరించాడు. అలాంటి వాటిలో కొన్నిటిని గూర్చి తెలుసుకుందాం.

నిర్మల ధర్మాన్ని ధర్మరాజు మొదలైనవారు అనుసరించారని, 'ధర్మ మెన్నపులకు తారక యోగంబు ' అని భారత కథ పరమార్థాన్ని చెప్పాడు. "





అందు నిందుననక యన్నిట జరికించి / విష్ణువరయు చుందు విదితముగను / చక్రి తిరుగు భూమి చక్రంబులోపల / అని భాగవత పరంగా శ్రీహరి విలాసాన్ని చెప్పాడు. రామ నామ మహాత్యం చాలా గొప్పదని, బోయయైన వాల్మీకి 'రామనామ పఠన మహిమచే / బాపడయ్యాడని / కులము ఘనము గాదు గుణము ఘనంబురా / అని గుణానికి ప్రాధాన్యత నివ్వాలని వాల్మీకి చంత ఆధారంగా చెప్పి జ్ఞానోదయం కల్పించాడు. స్త్రీకి ఎలా విలువనిచ్చారో దేవుళ్ళు అన్న విషయాన్ని తెలుపుతూ "స్త్రీ నెత్తిన రుద్రునకును / స్త్రీ నోటను బ్రహ్మ కపుడు సిరిగుల్కంగా / స్త్రీ నెదిరి రొమ్మున హరికి / స్త్రీ నెడపగ గురుడ నీవు దేవర వేమా ! " అని త్రిమూర్తుల చాపల్యాన్ని సరదాగా వివరించాడు. ఒకరి కంటె ఒకరు, స్త్రీకి ప్రాముఖ్యాన్నిచ్చిన విషయం తెలిపాడు. స్త్రీని దూరం చేసుకున్న గురుడే దేవుడు. స్త్రీ వ్యామోహం ఒద్దని భావన. 'బుద్ధి : కర్మాను సారిణి " అన్నారు. దీన్ని రావణా సురుని పరంగా అన్వయించాడు. నిలకడ బుద్ధిలేని కోతి సేనతో, లంకంతా నాశనం అయింది – అరివీరభీకరుడైన రాక్షసాధి పతియైన రావణుడు, ఆయన సేన, కపి సేన ముందు నిలువలేక వోడిపోయింది. పోగాలము వస్తే గడ్డి పోచ పామైకరుస్తుంది. ' చేటు కాలమైన జెఱుప నల్పుడెచాలు ' అని రావణ పరంగా సూక్ష్మాన్ని చెప్పాడు. కొందరి పుట్టుట ఆవంశానికి మేలు, గౌరవం. కొందరు పుట్టి వంశ సర్వ నాశనం చేసుకొంటారు. మొదటి రకంలో రాముడు, రెండవ రకంలో దుర్యోధనుడు వున్నారని చెబుతాడు – 'ఎవరి మంచి చెడ్డలెంచి చూచిన దేట " అని మంచి చెడులకు ప్రతినిధులు శ్రీరాముడు, కురుసార్వభౌముడు అంటాడు. కులంకాదు గుణమే ప్రధానం అని మరోసారి చెబుతూ వసిష్టని వృత్తాంతం జ్ఞప్తికి తెస్తాడు. ఆయన తల్లి దేవ వేశ్యయైన ఊర్వశి. భార్య, మాదిగ కులంలో పుట్టిన అరుంధతి – ఐతే మాత్రమేం ఆయన శ్రియ : పతియైన శ్రీరామునికి గురువైనాడు. ఇవన్నీ ఆయన తపస్సు

చేత సాధించిన దివ్యత్వం, బ్రాహ్మణత్వం, ద్విజత్వం, కనుక బురదలో పుట్టినంత మాత్రాన పద్మప్రభకేమీ కొదవ వుండదు అందుకే “తపము చేత ద్విజుడు తర్కింప కులమెట్లు ”? అని ప్రశ్నించాడు.

ఎంతో మంది రాజులు, చక్రవర్తులు భారత దేశాన్ని పరిపాలించినా షట్చక్రవర్తులు, షోడశరాజులు మాత్రమే చరిత్ర ప్రసిద్ధులై నారని గుర్తుచేస్తాడు ? దశరథ మహారాజు శ్రీరాముడికి పట్టాభిషేకం చేయాలను కొన్నాడు. కానీ విధివిలాసం – ఆయన అరణ్యాల పాలై జటా జూటధారి అయ్యాడు – కానీ కిరీట ధారికా లేక పోయాడు ” తలపు మనదె కాని, దైవిక మదివేరె ” అని తానొకటి తలిస్తే, దైవం వేరొకటి చేస్తుంది అనిలోకంలో జరిగే విషయాన్ని రామపరంగా చెప్పి, అంతా మన ఆధీనంకాదన్న సత్యాన్ని వివరించాడు. రామాయణంలో రాక్ష సహరణం, భారతంలో బంధునాశనం వుంటే బసవపురాణంలో పాపహరణం వుందని దాని విశిష్టతను తెల్పాడు. రామ నామం గొప్పతనాన్ని వేమన బాగా నే చాటి చెప్పాడు. “ రామ రామయనుచు రంజిలమదివేడి / రహిత పడగ మదిని రవళి వినుచు / మనసువంటి యున్న మహనీయుడనదగు / అని కమ్మగా రసరమ్యంగా రామనామాన్ని గురించి చెప్పాడు. మాయ ఎంతటి వారినైనా లోబర్చుకొని ఆడుకుంటుంది. హరి, అజుడు, దేవమునులు, శివుడు జన్మలు పొందారు. జరా, మరణాలు పొందారు. విధి వైపరీత్యం తప్పుదు ఇదంతా “ మాయవాసనవేమా / ” అని తత్వం బోధించాడు. రాజయోగ సాధన చేసిన వాడికి అసాధ్యం వుండదు. హనుమంతుడు రాజయోగ రహస్యజ్ఞాని. అందుకే ఆయన తేలిగ్గా దశయోజన విస్తీర్ణ లవణాంబుధిని అవలీలగా దాటి, లంకను చేరి సీతా మాత దర్శనం చేయగలిగాడు. ఆయన హృదయ మంతా రాముడు నిండి కొలువై వున్నాడు. మహాత్ములకు సాధ్యంకానిది లేదని రుజు చేశాడని “మాయలడచి ” రామాజ్ఞ మీరక వర్తించాడని తెలియజేశాడు.





కష్టాలు వచ్చినపుడు ధైర్యంలో ప్రవర్తించటం గొప్ప వారి లక్షణం. లక్ష్య సాధన కోసం యెంత వారితోనైనా పోరాడి గెలవటం వారికి సహజం. అలానే అర్జునుడు సాక్షాత్తు కాల కంఠుడైన శివునితో ద్వంద్వ యుద్ధంచేసి, మెప్పించి పాశుపతాస్త్రాన్ని వరంగా పొందాడు. దానిలో కౌరవ నాశనం సుసాధ్యమైందని వేమన వివరించాడు. అలాగే నలమహారాజు అడవులకు వెళ్ళి, యిబ్బందులు పడి, భార్యను కోల్పోయి, రూపంచెడి, చివరకు అంతా సుఖాంతం కాగా, శని ప్రభావం పోగా మళ్ళీ రాజ్యాన్ని, భార్యను దక్కించుకున్నాడు. “బుద్ధి నొక్కియెరుక పోకార్చుటలు ముక్తి ” అని నలచరిత్ర భాష్యం చెప్పాడు. పెద్దవాడికి అతి సామాన్యుడు సాయం చేస్తే దొడ్డ మనసులో మెచ్చి మనసుకు హత్తుకుంటాడు. అలానే లంకకు వారధి కట్టేసమయంలో ఉడుత చేసిన సాయానికి అచ్చెరువంది, వీపునిమిరి, తన చేతి వ్రేలి గుర్తులు దాని వీపుపై శాశ్వతంగా వుండేట్లు అనుగ్రహించాడు శ్రీరామచంద్రుడు. చిన్న సాయానికి అతి పెద్దవరం లభించింది ఈ సందర్భంగా “ ఉడుత రాముని కెంత ఊడిగంబులు చేసె / ఉడుతను రాముడు వాంఛచేత / వర కరంబుచే వీపు దువ్వగలేద / అని ఆ ఘట్టాన్ని చిరస్మరణీయం చేశాడు. ‘ఉడతాభక్తి ’ అన్నీ మాటకు చరితార్థకత కల్పించాడు వేమన. ఈ విధంగా ఇతిహాస పురాణాలను చక్కగా, సమన్వయంగా వ్యాఖ్యానించాడు వేమన.

## ఇంతకీ వేమనది ఏ వూరు ?

“ఊరుకొండ వీడు ఉనికి పశ్చిమ వీధి / మూగ సేతలెల్ల మొదటి ఇల్లు / యరసి చూడనది ముక్తి మార్గమే / అని వేమన తన వూరు గురించి చెప్పాడు. ఇందులో గూఢార్థం వుందని బ్రౌను అభిప్రాయపడి ఇంగ్లీషులో వ్యాఖ్యానించాడు. శరీరం అనే గ్రామంలో, ఎత్తైన ప్రదేశమైన శిరస్సులో పరమాత్మ

వుంటాడు. వెనకవీధి అనేది వెన్నెముక. అందులో 6 చక్రాలున్నాయి. మొదటిది నిశ్శబ్దంగా వుండే మూలధారం. ఇక్కడి నుంచి ప్రయాణం చేస్తే సహస్రారం చేరితే ఆత్మ దర్శనం అవుతుంది. అదంతా ఆనందమయం. సచ్చిదానందం, సుందరం అని వేమన భావించినట్లు బ్రౌను వివరణ నిచ్చాడు. ఆయన మార్గం యోగ మార్గం. ఆయన గమ్యం ఆత్మదర్శనం. ప్రాంత, కుల, భాషా పరిధులక తీతుడు – విశ్వకుటుంబి వేమన.

## "వేమన స్తుతిమాల "

ఇంతటి ప్రజాదరణ పొందిన పద్యాలను ముక్త కాలుగా, ముత్యాలుగా చెప్పి తెలుగు సరస్వతికి మూక్తి కాభిషేకం చేశాడు ప్రజా కవి వేమన. అలాంటి వేమన గురించి ప్రముఖుల అభిప్రాయాలను నీరాజనంగా ఒక చోట చేర్చటం యుక్తమనిపించింది. అది ఘన నివాళిగా భాసించింది. వేమన కవితా తత్త్వ విచారంగా మూర్తి మత్వ వికాసంగా గోచరించింది. " కవులని పేరు సంపాదింపని కవులలో చేరిన కవి వేమన " అన్నారు. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ తాను వ్రాసిన 'వేమన ' అన్నీ పుస్తకంలో " ఉల్లేఖాలంకారానికి వేమన ఉజ్వల మైన ఉదాహరణము. ఆయనలోక కవి, విశ్వకవి, ప్రజాకవి, నాథయోగి " అని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి ' మన వేమన ' లో స్తుతించారు. సమగ్రాంధ సాహిత్యంలో ఆరుద్ర " పామరుల దృష్టిలో వేమనకవి కాదు. అవతార పురుషుడు, పండితులు, సాహిత్య చరిత్రకారులు ఆయన్ను మహా కవిగా గుర్తించలేదు. ఆయన్ను కవిగా గుర్తించిన వారు ఆధునికులే. కొమర్రాజు లక్ష్మణరావు ఇల్లలికారు. కట్టమంచివారు ముగ్గు పెట్టారు. వంగూరి గారు పీటవేశారు. వేటూరి వారు, బండారు వారు, శేషాద్రి రమణ కవులు ప్రస్తుతించారు. రాళ్ళపల్లి వారు మహాకవిగా ప్రస్తుతించారు " అని కీర్తి కిరీటం





పెట్టారు. " వేదాలు లిఖితాలు కావు. వేమన కవితలు అంతే. సన్యసించిన తర్వాత గోచితో పాటు గంటమునూ విసరి వేసినవాడే. సందర్భాన్ని బట్టి ఆశువుగా చెప్పిన పద్యాలు, జనం నాలుకపై నిలిచిపోయాయి. వినగానే నోటికి వచ్చే లక్షణం ఆ పద్యాలకుంది. నోటి ప్రచారం తర్వాత తాటాకుల పైకి చేరాయి. లేఖక పాఠక ప్రమాదములు వేమన కున్నంతగా నెవరికీ లేవు. నిరీక్ష రసముల నోటను, నింటను బడి బ్రతికినవి " అని త్రిపురనేని వెంకటేశ్వరరావు ' విశ్వదాభిరామ వినురవేమ ' లో వివరించారు. " ముక్తకం వ్యంగ్య పూరితం. ముక్తకాన్ని వినడం ప్రారంభించగానే పఠితలో ఉద్భుధమయ్యే కుతూహలాన్ని పద్యం ముగిసేలోగా తృప్తి పరచగలగాలి. ముక్త కానికి క్లుప్తత అందం. ఈ సంక్షిప్తతే అనవసరమైన విషయ వివరణ అనే దోషం పట్టకుండా కాపాడుతుంది. పై ముక్తక లక్షణాలు చాల వరకు వేమన పద్యాలకు వర్తిస్తాయి." అని డాక్టర్ ఎన్. గోపి 'ప్రజాకవి వేమన' లో ముత్యాల జల్లు జల్లారు. ' తనకు తోచిన అంశాన్ని వస్తువుగా గ్రహించి శతక పద్యాలను చెప్పిన వారిలో వేమన ఆద్యుడు " అన్నారు డా.కె.గోపాలకృష్ణారావు 'ఆంధ్రశతక సాహిత్య వికాసం'లో.

"శాప గ్రస్తుడైన జీవి విరక్తి మార్గం పడతాడు. పరమార్థాన్ని అన్వేషిస్తాడు. వేమన్న జీవితం యిదే మార్గాన్ని పట్టింది. యవ్వనంలో మోహికభోగాలను భవించాడు. అందులో అర్థార్థి సంబంధం తప్ప పరమార్థంతో కూడిన పరమార్థం కన్పించలేదు. కాంచనం, వంచనం, రక్తిమార్గంలో ముళ్ళ పొదల్లా కన్పించాయి. దాన్ని వదిలి భక్తి మార్గం పట్టాలి. భక్తికి విశ్వాసం ముఖ్యం. వివేకాన్ని నమ్మినంతగా విశ్వాసాన్ని నమ్మలేదు. అందుకని భక్తుడు కాలేక పోయాడు, కాని భగవంతుని చేరే మార్గాలనన్నింటిని పరామర్శించాడు. బహిర్ముఖ జీవితంపై కోపం వచ్చింది. అంతర్ముఖుడై ఆయనలోనే భగవంతుణ్ణి చూసుకున్నాడు. జీవితం నేర్పిన గుణ పాఠంయిది. ' నీలో నే నిజం వుంది

తెలుసుకో ' అని చివరకు పాఠం నేర్పింది. అందుకే కవిత్వం ఆత్మాశ్రయం అయింది. అదే దాని అంతర్లీన శక్తి " అని అద్భుతంగా వేమన్న జీవితాన్ని, కవిత్వాన్ని విశ్లేషించారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం తన ' వేమన యోగి, పద్యం ప్రక్రియ, మకుటం ముద్ర ' అన్న వ్యాసంలో. 'వేమన్న దృష్టిలో మనిషే దేవుడు. ఆయన తత్వం మానవతా వాదం. ప్రబోధంతో పాటు సంస్కరణ అవసరం అని భావించాడు. మానవుడే మాధవుడని చెప్పిన జ్ఞానయోగి. అందుకే ఆయనది వేదవాక్కు. ఆయన్ను సమాజకవిగా, నాధ సంప్రదాయ కవిగా భావించారు. ఆయన హక్కు ప్రజల గుండెల్లో సరాసరి ప్రవేశించి నిలిచే శక్తి కలది. వేమనలో కలిసి పాడటం, వేమన వలె సొంతంగా పద్యం పాడటం అప్పటికి, ఇప్పటికి కళ. వేమన పద్యాలనే ప్రసిద్ధి. మకుటం వుండటం వల్ల శతకం అంటారు. మకుటం పెట్టటంవల్ల పద కవితా సంప్రదాయం కూడా కలిసింది. శతకపద ప్రక్రియలను మకుట ముద్రలో యోగించి యోగి అయ్యాడు. అతని పద్యం ఒక ప్రక్రియ. అతని మకుటం ఒక ముద్ర. పదానికి, పద్యానికి ఒక విచిత్ర సంబంధం కలిపాడు. తత్వంలా పాడాడు. వేమన తనువు చాలించినా ఆతని పద్యం జీవితం చాలించలేదు. పాటరాని పదకర్తలు వేమన పద్యాల అనురక్తులు. పదం భక్తిలో మునిగింది. పద్యం బతుకులో ఈదింది " అని ఆచార్య జి.వి. వేమనను ఆయన కవిత్వాన్నికి చిరంజీవిగా భావించారు.

'ఆధ్యాత్మిక సంకరభావ మూఢాచారాలను భస్మీపటలం గావించే విప్లవ మహాగ్ని జ్వాలగా విశ్వకవి వేమన, ఆయన పద్యాలు జరామరణ మెరుగని, చెద పట్టని చింత నిప్పులు, చిలుంపట్టని స్వరాక్షరాలు, కుల మత ఛాందసుల కుత్తుకలకు అవి గారాలు " అని విప్లవాభి వందనం చేస్తారు, వేమన భావాలను అనేక కోణాల్లో ఆవిష్కరించిన శ్రీ బత్తిన గురుమూర్తి తమ 'వేమన పద్య సందేశం"లో.





"వేమన్న గారు జీవితంలో బంగారం చేశారో లేదో కాని వారు పలికిన పలుకులుని బంగారం చేశారు".అని ఆరుద్ర బంగారం లాంటి మాటలు చెప్పారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వేమనగారి 100 పద్యాలను సంస్కృతంలోకి తర్జుమా చేసి ప్రచురించి ఘన నివాళులిచ్చారు. అనువాదాన్ని ప్రఖ్యాత సంస్కృత విద్యాంసులు,చిట్టిగుడూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఐ.ఊ.న్త్ర వరదాచార్యులు చేయటం అద్భుతమైన విషయం గద్వాల ఆస్థాన కవులు శతావధానులు గంధం శ్రీరామమూర్తి గారు,ఇర్రింకి నరసింహమూర్తి గారు 'వేమనగీత' పేరులో అనుష్టవ్ శ్లోకాలుగా అనువదించినట్లు ఆరుద్రవ్రాశారు.'వేమ' అనే మకుటపదం శ్లోకంలో ఎక్కడో ఒక చోట వచ్చేటట్లు అనువదించారు.

చార్లేస్ E. గోవరు దొర వేమన సూక్తుల్ని ఇంగ్లీష్ పద్యానువాదంచేసి ఆంగ్ల సాహిత్య రంగ ప్రవేశం కల్పించారు వేమన విశ్వకవికి. పద్యాల విషయంలోకి వచ్చాం కనుక వేమన్నను ఘనంగాపద్యాలలో శ్లాఘించిన వైనాన్ని చూద్దాం. శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు వేమన్నను –

"సకల మతములనొకత్రోవ జరిపినావు / నిఖిల జాతుల నొక యింట నిలిపినావు / అఖిలశక్తుల నొకచోట కలిపినావు / పరమ యేగేంద్ర వేమభూపాలచంద్రా" అంటూ ఆయన విశ్వరూపాన్ని కళ్ళకు కట్టించారు.కర్పూర నీరాజనం పట్టారు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి పద్య నివాళులర్పిస్తూ

"ఏమేనిన్ పఠియింపకే సముదితాహీన ప్రబోదంబునన్
సామాన్య ప్రజకేని యశ్రమకర స్పష్టాపభోగంబుగా
వేమారున్ మననంబు సేయదగు, నవ్వేదాంత సిద్ధాంతముల్
వేమారెడ్డి రచించె పద్య ఫణితిన్, విశ్వాభిరామంబుగన్"

అన్నారు మనోహరంగా,మన్మోహనంగా

వేమన కాలాన్ని గూర్చిన వివాదంలోకి తాను ప్రవేశించనని " నీ వాచా మాధురి నీ నిరర్గళ కవిత్వ స్ఫూర్తి గీర్తించెదన్" అని మనస్ఫూర్తిగా కీర్తించారు కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు. ఆయనే --

అభిరామాకృతులైన నీ కృతులు నవ్యత్వాభి రామమ్ములై
ప్రభుతం గన్నవి, యావదాంధ్ర జన హృత్పద్మమ్ములన్, భాను స
న్నిభ! యుష్మత్కవితారుణ ప్రభలు నిండెన్, గేహ గేహాల
యభివాదమ్ములు గొమ్ము వేమన కవీంద్రా! కర్మ యోగీశ్వరా!
అని వేమన కవితకు పద్యాభిషేకం చేశారు.

ఉభయభాషాప్రవీణ ఉత్పల వేంకటరంగాచార్యులగారు వేమన పద్యాలను సేకరించి,పరిష్కరించి 3,166 పద్యాలను 'వేమన పద్యాలు' పేరిట ప్రచురించారు.అందులో వేమన జీవితాన్ని సంగ్రహంగా తెలియజేశారు."వేమన ఒక యోగివల్ల తత్వోపదేశమునంది పులుగడిగిన ముత్తెమువలె ప్రకాశించుచు సంసారమునకు, లోకమునుకు ఏవగింపునంది,యనుభవములను సామాన్యప్రజల కెల్లరకు సుబోధకరమగునట్లు,సామాన్యభాషలో పద్యములుగబాడుచు దేశాటనముల గావించుచు,చక్కని తెలుగు నుడికారముల దేశములవెదజల్లినాడు " అని ఆచార్యులవారు శ్లేషించారు.

"ఒక్క పొల్లుమాటకూడా వాడకుండా, మర్రి విత్తనం అంత చిన్న పద్యంలో, మహా వృక్షమంత అనుభవాన్నివ్వగలవాడు మహాకవి. మాటలు పొదుపుగావాడటం అనే సుగుణం మన సాహిత్యంలో 'కవిత్రయం' వారితోనే కరువైపోయింది.ఆముగ్గురి తర్వాత, వెతికితే వేమన గారు తప్ప కనుచూపు మెరలో యింకెవరూలేరు.కవిత్రయం వారిలో లేని ఇంకొక గొప్పతనం వేమన గారిలో కనపడుతుంది.అది,పుస్తకాల్లోని పదాలు కాక జీవితంలోని మాటలే





వాడటం" అని వేమన ప్రత్యేకతను ఆరుద్ర తన భావముద్రలో పదిలం చేశాడు. వేమన చాలా ప్రదేశాలు తిరిగినట్లు ఆయన పద్యాలే చెబుతున్నాయి.ఆయన పుట్టిన ప్రదేశాన్ని ఖచ్చితంగా యెవరూ చెప్పలేకపోతున్నారు.అయితే చివరి సారిగా ఆయన కడప జిల్లా పామూరు వద్ద కొండ బిలంలో ప్రవేశించారని లోకులు చెప్పుకుంటారు.కదిరిపరగణా కటార్ల పల్లెలో వేమన సమాధి వుంది.ఏటా అక్కడ ఉత్సవాలు జరుగుతాయని,వేమన్న గారి శిష్యపరంపరలోని వారమని కొందరు బక్క గుర్రాలెక్కి వూరేగుతారని ఆరుద్ర రాశారు.కడపలో వేమన విశ్వవిద్యాలయాన్ని మన రాష్ట్ర ప్రభుత్వం యేర్పాటు చేసింది. కృష్ణా జిల్లా తేలప్రోలులో వేమన గ్రంధాలయం వుంది.

వేమన ప్రభావంలో కవిత్వం వ్రాసినవారిలో కూచిమంచి తిమ్మయ్య,కనుమర్తి అచ్చయ్య ,కూచిమంచి జగ్గనవున్నట్లు ఆరుద్రే వివరించారు.వేమన చెప్పిన"తల్లి దండ్రి మీద దయలేని పుత్రుడు"అన్న పద్య ఛాయలు తంజావూరులోని శివాజీ వ్రాసిన యక్షగానంలో ముఖరిరాగంలో చెప్పిన ఒక పద్యంలో వున్నట్లు ఆరుద్ర ధృవీకరించారు. అలాగే 'తుళ జాజి' కూడ 'రాజ రంజన పద్యవిలాసం'లో వేమన లాగే "దండిగా తాను తెలియ తానె పోబ్రహ్మ" మన్నాడనీ ఆయనే చెప్పారు. ముద్దుపళని కూడ వేమన పద్య ప్రభావానికి లోనై రాసింది.18వ శతాబ్ద ఉత్తరార్ధంలో చాలా మంది కవులపై వేమనగారి పద్యరచనా శిల్ప ప్రభావం ముమ్మరంగా వుందని ఆరుద్ర పరిశోధించి చెప్పారు.

ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొర 2.500 వందల వేమన పద్యాలు సేకరించారు. ఆద్దేపల్లి అండ్కో వారు 5010 పద్యాలు ప్రచురించారు. వేమన పద్యాలు ప్రాచ్యలిఖిత గ్రంధాలయంలో 58 సంపుటాలలో వున్నాయి. ఇంగ్లీష్ వ్యాఖ్యానంతో బ్రౌన్ 3,228 పద్యాలను 5 భాగాల్లో వ్రాశాడు.

"స్త్రీలను చంపువానిని శివుడు మెచ్చగలేడు / స్త్రీల చంపువాడు శిథిలమగును"/ అనీ, " ఆలు అనగా ఆత్మ అనీ,ఆలి అనగా అమ్మ సుమి" అనీ, భార్య అమ్మతో సమానమనీ, "తల్లి దండ్రులెన్నదగు తొలి గురువులు/ పార్వతీ భవులిలవొలి గురువులు",అని కీర్తించిన వేమన్న స్త్రీ ద్వేషి కాదు-"ఒకానొక చారిత్రక సంధ్యలో ఒక వ్యక్త ప్రతి స్పందనలుగా వేమన చెప్పిన వాటిని గుర్తించాలి - ఆయన వాదన వెలది,ఆడది వంటి పదాలు నీచబుద్ధి కలిగిన స్త్రీ లకు మాత్రమే వర్తిస్తాయి. మాతృమూర్తులకు,సంసారస్త్రీలకు వర్తించవు" - "ఆయన విశ్వసత్యాన్వేషి" అని శ్రీ ద్వావరి నరేంద్రరెడ్డి ప్రశంసించారు - సత్యం తెలిపారు - సందేహనివృత్తి చేశారు.

వేమన సౌమ్యవాది.సమ సమాజనిర్మాణం కోరాడు. సాటివాడు సహాయం అర్జిస్తే సహాయం చేయని "మగవాడా? మగువగాక మహిలోవేమ" అని చేతగాని వాడని పురుషుని నిందిస్తాడు. దాతలు స్వార్ధంతో గాక పరార్ధం కోసం బ్రతకాలి.ధైర్యవంతులు బలహీనుల్ని భాధించే ధనవంతుల ఆస్తులను స్వాధీనం చేసుకొని ధరిద్రులకు పంచిపెట్టాలి. నెత్తి మీద పడె పిడుగు కుడా ఒక్కడుగు ముందుకువేస్తే,మీద పడదు- ప్రమాదం తప్పుతుంది అంటాడు."ద్రోహబుద్ధినైనా,దొంగతనమునైన/నటననైన,సాహసముననైన/ సంపదధికుల వలన సాధించి/ధనము బడుగులకు నిమ్ము వేమా/" అని ఒక సోషలిస్టుగా ప్రబోధించాడు.

ఎప్పుడైతే మనిషి అన్ని దేశాలను ఒకే దేశంగా చూస్తాడో, అప్పుడే శాంతి,క్రాంతి.విశ్వకుటుంబ భావన వేమన చాటాడో పద్యంలో "దేశములకెల్ల జాలెడు తెలివి గలిగి/సకల దేశములను విజ్ఞన భరిత/ ధర్మ సందేశముల బంపు ధన్యమతుల/దేశమిదియది యననేమి తెలివి వేమ" చెప్పాడు.సంకుచితత్వం సమసిపోవాలి.అడ్డ గోడలు కూలిపోవాలి .విశ్వ సోదర ప్రేమ వెల్లి విరియాలని ఏనాడో చెప్పిన వేమన్న కాలాలకు,దేశాలకు అతీతుడు కదా!





దేశం సర్వతో ముఖాజభివృధికి యెన్ని ప్రణాళికలు రచించినా,యెంత డబ్బు ఖర్చు చేసినా,దేశ ప్రజల మధ్య ఐక్యత లేకపోతే,నిత్యంతగాదాలే - మారణహోమాలే - అనుమానాలే - నిర్బందాలే. వీటన్నిటిని అధిగమించి, సంఘ బలంతో కదిలితే దేశ పునర్నిర్మాణం సుసాధ్యం. దీన్ని చక్కని సందేశంగా ఆనాడే "ఐకమత్య మొక్కటావశ్యకం బెపుడు / దాని బలిమినెంత యైన గలుగు / గడ్డి వెంటి బెట్టి కట్టవా యేనుంగు ? " పద్యంలో విస్పష్టంగా చెప్పాడు. స్వార్థంలో, వ్యామోహంతో, సంకుచితత్వంలో మనం విడిపోనున్నాం. అంతా కలిసి వుంటే మహ్మదీయిలైనా, బ్రిటిష్ వాళ్ళైనా మన్నేమి చేయగలిగి వుండేవారు కాదు. మన జాతి స్వతంత్ర సాధన కోసం ఆసేతు హిమాచలం ఐక్యగానం వినిపించి, స్వాతంత్ర్యం సాధించింది. అరవై యేళ్ళ స్వాతంత్ర వజ్రోత్సవాలు జరుపుకుంది. ఈ ఐక్యత చెడరాదు. మహామహుల త్యాగం వృధా కారాదు. విశ్వ కుటుంబ భావన సర్వదా, శిరోధార్యం. ఈ భావం నిలిస్తే, వేమన చిరంజీవి, ప్రపంచమంతా సచ్చిదానందమే. ఇది వేమన్న సమగ్ర దర్శనం కాకపోయినా, సమ్యక్ దర్శనం. సచ్చిదానందమే. ఇది వేమన్న సమగ్ర దర్శనం కాకపోయినా, సమ్యక్ దర్శనం.

## "వేమన గురించి కధలు,గాధలు "

" Dates are the weakest links in Indian History " అన్నాడు మాక్స్ముల్లర్. భారతదేశ చరిత్రలో తారీకులు సరిగా వుండవు అని ఆయన భావం.నిజమే మన కవులు,రచయితలు తాము వ్రాసిన విషయాలకు ప్రాధాన్యతనిచ్చారు కాని,తమ జీవిత చరిత్రలకు ప్రాధాన్యత నివ్వలేదు.ఏకొద్ది మందొ తండ్రి,తాతలను గురించి కొద్దిగా చెప్పుకున్నారు. అవీ అరకొరగా. చరిత్రకు ప్రాధాన్నత నివ్వలేదు. మన చరిత్రంతా పాశ్చాత్యులే

వ్రాశారు.కాలనిర్ణయానికి సరైన తేదీలు లేక పోవటంతో వాళ్ళయిష్టం వచ్చినట్లు చరిత్ర సృష్టించి మన నెత్తిన రుద్దారు.అదంతా తప్పులతడక అని తెలుసుకోవడానికి చాలా కాలం పట్టింది. దీన్ని సరి చేసుకునే ప్రయత్నం మన చరిత్రకారులు చేశారు.దొరికిన ఆధారాలన్ని గాలించారు.రాజుల కాలం,కవుల కాలం బేరీజు వేసి ఎవరికి తోచింది వారు చెప్పారు. ఇక్కడా పొంతన కుదరలేదు. ఒకరిద్దరు దరిదాపులకు వచ్చినా, మిగిలిన వారు కాదు పొమ్మన్న స్థితి.ఇదీ మన చరిత్ర అందుకే అంతా సుమారు కాలనిర్ణయమే జరిగింది. పాశ్చాత్య వాదాన్ని కాదని మన చరిత్రకారుల సిద్దాంత విత్య,చారిత్రక ఆధారాల దృష్ట్యా కాలనిర్ణయం చేసినా యింకా అనుమానం.మూడు నాలుగు వందల క్రితం వున్న రచయితల చరిత్రే మనకు నిర్దుష్టంగా తెలియదు.అలాంటి రామాయణ,జభారత కాలనిర్ణయము గగనమై పోయింది.పాశ్చాత్యుల నిర్ణయంలో వారికి తెలిసిన మూడు లేక నాలుగు వేల క్రిందటి విషయాలే ఆధారం. మనది అలాకాదు.మన భారతం,భవిష్యత్పురాణం మంచి ఆధారాలిచ్చాయి.భారతయుద్ధం, ఆధారంగా కాల నిర్ణయం జరగాలి. మన పంచాంగాలు మన ప్రమాణాలు. వీటన్నిటి ఆధారంగా మన విజయవాడ వాస్తవ్యులు స్వర్గీయ కోట వెంకటాచలం గారు భారతదేశంలో రాజులు పాలించిన కాలాన్ని,గుప్తుల,మౌర్యుల కాలాన్ని,ఆంధ్రరాజుల కాలాన్ని,శంకరాచార్యుల కాలాన్ని నిర్దుష్టంగా ఆధారాలతో ప్రచురించారు.పాశ్చాత్య చరిత్రకారులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి,భారత చరిత్రకారుల అభిప్రాయాలను క్రోడీకరించి.ఒక పెద్ద విశ్వవిద్యాలయం చేయాల్సిన పనిని వెంకట చలం గారు ఒక్కరే ఒంటి చేత్తో చేశారు.అవునంటానికి మన సొప్ప లేదు.కాదని తిరస్కరించే దమ్ము లేకపోయింది.ఇదీ మన చరిత్ర గతి. ఇక మన వాళ్ళకు ఓ విచిత్ర భావన వుంది.తాము వ్రాసే కవి,రచయిత మరీగొప్పవాడనిపిస్తే ,వారి చుట్టూ





అభూతకల్పనలు, అసంగత విషయాలు,మహిమలు,మాయలు అంటగట్టి, నమ్మశక్యంలేని స్థితిలోకి అసలు చరిత్రను నెట్టేయటం. అద్భుతాలు లేకపోతే వారి చరిత్రకేదోలోపం వస్తుందన్న భావన.అందుకే ఎక్కడా పొంతనలేని విషయాలు చోటుచేసుకున్నాయి కవుల చరిత్రలో,రాజుల చరిత్రలో,ఇందులో నిజమెంతో,అల్లిక యెంతో తెలియని అగమ్య అగోచరం.తెనాలి రామలింగడి చుట్టూ,శ్రీనాధుడి చుట్టూ యీ అల్లికలన్ని అల్లిబిల్లిగా అల్లుకున్నాయి. ఇంక వేమన సంగతి చెప్పక్కర్లేదు,కులం,వూరు, పేరుల్లో మార్పులు – మహిమలు,మంత్రాలు –ఎన్నో చేరాయి. అదోకీకారణ్యం – ఓ సారి అందులో ప్రవేశించి తమాషా చూద్దాం 'షికారు'చేసినట్టుంటుంది. "నిజం సిరి" దొరక్క పోయినా,కాలక్షేపంబానే వుంటుంది.

"రాష్ట్ర కూటులు" రెడ్డి పదంతో వర్ధిల్లారు.రాజ్యస్థాపన చేసి చరిత్ర సృష్టించారు.రెడ్డి రాజ్యనికి మూల పురుషుడు గా "దొంతి అల్లాడ రెడ్డి" పంట రెడ్డి శాఖకు చెందిన వాడు.నైజాంలోని 'చదలవాడ'లో వ్యవసాయం చేస్తుండేవాడు.ఒక రోజాయన అపారధనంలభించింది. దాన్ని దోచుకోవాలని కొందరు ప్రయత్నం చేయటం తెలిసింది. ఆవూరి దేవుడు 'వీర రాఘవ స్వామి' కలలోకన్పించి,వెంటనే వూరు వదిలి వెళ్ళమన్నాడు.అక్కడ నుండి 'హనుమకొండ' చేరాడు.బంగారంతో రాఘవదేవ విగ్రహం చేయించి పూజిస్తున్నాడు.అక్కడి నుంచి మకామును కొండ వీడులోని కవులూరు,ఆ తర్వాత ధరణి కోట చేరి,అందరితో మంచిగా వుంటూ,సంపన్నుడై మన్ననలుపొందాడు.ఇది యిలావుంటే 'వేమన' అనే వైశ్యుడొకడు శ్రీశైలం వెళ్ళి 'పరుసవేది' ని సంపాదించి.దాని ప్రభావంతో అక్కడున్న నాగలి బంగారం గా మారింది.ఇది చూసిన అల్లాడ రెడ్డి పరుసవేది రహస్యం అర్ధమై,ఆ కుండను ఇంట్లో దాచి,పాకకు నిప్పంటించాడు.ఆ మంటల్లో కోమటి వేమన సజీవ దహనమయ్యాడు.కథ ఇంతటితో ఆగలేదు.అల్లా రెడ్డికి

కలలో కోమటి వేమన కన్పించి,రెడ్డి చేసిన ద్రోహన్నంతా వివరించి, తనకు ఆశ్రయం ఇచ్చినందుకు గాను కొంత జాలి పడి,రెడ్డి వంశంలో ఆరుగురు రాజులు వంద యేళ్ళు మాత్రమే రాజ్యం చేస్తారని, వంశంలో పుట్టిన ప్రతీవానికి తన పేరు పెట్టమని దాన ధర్మాలన్ని తనకు అర్పించమని శాపంలాంటి వరం ఇచ్చాడు. వంశం నిర్వంశం కాకుండా చేసినందుకు రెడ్డి సంతోషించాడు.అప్పటినుండి రెడ్డి రాజులందరికి "వేమ" అనే పేరు ముందు చేరింది.వీరిలో పొంతి,దేసటి అనే రెండు ఇంటి పేర్ల వారున్నారు.ఈ విధంగా కోమటి వేమన రెడ్డి వేమన గా రూపు దాల్చాడని ఓ కథ ప్రచారంలో వుంది.అల్లాడ రెడ్డి కుమారుడు ' కోమటి ప్రోలయ వేమారెడ్డి' ఇతడు కాకతి ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షుడై,ఆయన్ను బందీ చేసి తురుష్కులు తీసుకొని పోగా,రాజ్యపాలకుడై క్రీ.శ 1324 లో రెడ్డి రాజ్యాన్ని స్థాపించి,1350 వరకు పాలించాడు.ఎర్రన వ్రాసిన హరివంశంలో యితను అద్దంకి రాజధానిగా పరిపాలించినట్లుంది. అక్కడ్నుంచి 1320 లో కొండవీడు చేరి గొప్ప కోటకట్టి పాలించాడు.

ప్రోలయ వేమారెడ్డికి కోమటి రెడ్డి, అనపోత వేమారెడ్డి, అన వేమారెడ్డి కొడుకులు.అన పోత వేమారెడ్డి రాజై 1350- 1362 వరకు బాగా పాలించాడు.ఇతని తమ్ముడు తార్వాత రాజై 1362 - 1380 వరకు రాజ్యమేలాడు.పండితుడు,రసజ్ఞుడు,కవులపాలిటి కల్ప వృక్షం.తర్వాత అనపోత వేమారెడ్డి కుమారుడు 'కుమారగిరి వేమారెడ్డి' 1380 -1400 వరకు రాజ్యం చేశాడు.'అనంతరాజీయం' అనే నాట్య శాస్త్ర కర్త.ఇతని తర్వాత ఇతని పెద తాత మనవడు 'పెదకోమటి వేమారెడ్డి' కొండవీటి రాజైనాడు.1400 - 1420 వరకు రాజ్యపాలన చేశాడు.'సర్వజ్ఞ చక్రవర్తి' బిరుదాంకితుడు.శ్రీనాధమహాకవిని ఆస్థాన కవిగా చేశాడు. 'అమరుక' కావ్యానికి 'అమరదీపిక' వ్యాఖ్యానం రాశాడు.ధరణి కోటలో జరిగిన యుద్ధంలో పెద కోమటి వేమారెడ్డి తమ్ముడైన





'మాచయ'ను 'పనదేవగిరి'చంపాడు. దేవగిరిని పెదకోమటి వేమారెడ్డి చంపేశాడు.దేవగిరి తమ్ముడు 'లింగయ' ప్రతీకారంలో పెద కోమటి రెడ్డిని చంపేశాడు. ఇదంతా యేందుకంటే మన వేమన కవి యీ కాలానికి చెందినవాడని చెప్పటానికే.

పెద కోమటి వేమారెడ్డి కొడుకు 'రాచ వేమారెడ్డి ' 1420 - 1424 వరకు రాజ్యం చేశాడు.కొండవీటి రెడ్డి రాజుల్లో చివరి వాడీయనే.'పురిటిపన్ను' విధించి జన కంటకుడయాడు.'సీరం ఎల్లప్ప' అనే బలిజ నాయకుడు ముత్యాలమ్మ గుడి దగ్గర రాచవేమా రెడ్డి ని, పన్ను విధించినందుకు కోపంతో హత్యచేసి రెడ్డి రాజ్య నిర్మూలనకు కారణమైనాడు.

పెదకోమటి వేమా రెడ్డి కుమారుడు 'రాచవేముడు'.ఇతని తమ్ముడే 'వేమన' అని ఒ కథ. ఇదే నిజమైతే 15 వ శతాబ్ది వాడు వేమన కాదని బ్రౌను తీర్చి 17 వ శతాబ్ది వాడని అంటే,18 వ శతాబ్ది వాడని 'మాక్లిన్ దొర' అన్నాడు.ఈ వివరాలను బట్టి వేమన 'రెడ్డి' కులానికి చెందిన వాడని తెలుస్తోంది.వేమనగా పద్యం దీన్ని దృవీకరిస్తోంది."మనమున వేసిన మైనపు జడ్డి / ప్రణతమునైదగు రావుల దొడ్డి / యనువునజేసెను నందన నొడ్డి / వితతముగాగను వేమన్న రెడ్డి "/ అని ఓరియంటల్ లైబ్రరిలోని ప్రతి సాక్ష్యమిస్తుంది.దాదాపు అందరూ 1652 ప్రాంతంవాడని చివరికి తేల్చారు.

జన్మస్థలం "కొండ వీడు" అని వేమనే చెప్పుకున్నాడు కదా! ఆపట్నంలో 82 పేటలుండేవట. అందులో 'మూగ చింత పల్లి" అనే పేటలో మెదటి ఇల్లు వేమనదేనట.

తను జన్మించిన కాలాన్ని వేమన పద్యంలో బింధించాడు. "నందన సంవత్సరమున /పొందుగా గార్తీక శుద్ధ పున్నమనాడున్ / వింధ్యాద్రి సేతుబంధన / సందున నొక వీరుడేగు సరగున వేమా"/ అన్నీ పరిశీలించి 1412 వ

సంవత్సరం కార్తీక శుద్ధ పౌర్ణమినాడు వేమన జన్మించినట్లు తేల్చారు. 68 ఏళ్ళు జీవించి 1480 శార్వరి సంవత్సర చైత్రశుద్ధ నవమినాడు సిద్ధిపొందాడు. ఈ విషయాలన్ని "కవి కోకిల, వాస్తు విశారద,అముద్రిత వాఙ్మయశేఖర" బిరుదాంకితులైన శ్రీ నేదునూరి గంగాధరం గారు 'మహా యోగి వేమన కవి జీవితం' లో విపులంగా వ్రాసి,పాఠకజనానికి అపూర్వ కానుకగా అందించారు.

**" రెండో కథ "**

వేమన కొండవీటి రెడ్డి వంశంలో 'కనుగోళ్ళ' గోత్రంవాడని,అసలు పేరు పుల్లా రెడ్డి అని, అన్నగారు రాజు అని ఆయన్తో పోట్లాడి తల్లితో 'కదిరి' పట్టణం దగ్గర 'నల్ల చెరువు' అనే ప్రదేశానికి వచ్చి వచ్చి వ్యవసాయం చేసుకుంటూ జీవించాడని,ఒక రోజు నెత్తిన పిడుగుపడి చనిపోయాడని, దహన క్రియలు జరుపబోగా, తల్లి కి కలలో కన్పించి ఏడు రోజుల్లో మళ్ళీ బతుకుతానని చెప్పాడని,ఎనిమిదవ రోజు పునరుద్దానం పొందాడని,ఆశ్చర్యపడిన జనంతో తాను పుల్లారెడ్డి కాదని,'వేమన' అని చెప్పాడని ఒక కథనం. ఆ తర్వాత చాలా మహాత్యాలు చూపుతూ దేశ సంచారం చేస్తూ కడప జిల్లా రాజం పేట దగ్గర 'కోడూరు' చేరాడని,తల్లి 'అచ్చమ్మ ',భార్య 'ఆదిలక్ష్మమ్మ 'కుచ్చేర్లపాడు గ్రామంలో మరణించారని,వేమన వాళ్ళిద్దరికి సమాధులు కట్టించాడని,అవి ఇప్పటికి ఉన్నాయని,తర్వాత కటార్ల పల్లే చేరి జీవ సమాధిపొందాడని కథ ప్రచారంలో వున్నట్లు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ గారు 'వేమన' పుస్తకంలో వుటంకించి,ఆ వేమన్న కాదని పరిశీలనలో తేలినట్లు చెప్పారు.ఇదంతా పుక్కిటి పురాంణంగా కొట్టి పారేశారాయన.

**" మూడో కథ "**

వైకుంఠంలో ఓ రోజు విష్ణుమూర్తి, లక్ష్మీ దేవి కలిసి వేమన్న ను పిలిచి





భూలోకం లో అవతరించమని కోరగా, తుంగవంశంలో కేశవుడు,లక్ష్మమ్మ (అచ్చమ్మ) కు సంతానంగా జన్మించాడని, తర్వాత కదిరి చేరారని, వేమన తత్వాన్ని అందరికి వుపదేశించేవాడని పురాణ పురుషుడుగా ఓ కథ ప్రచారం లో వుందని. రాళ్ళపల్లి వారు వుటంకంచి, వేమన్న 15 వ శతాబ్ది వాడన్నారు.

కడప జిల్లా జమ్ముల మడుగు తాలూకా 'ముడియం' అనే వూళ్ళో వేమన శిష్యుల పీఠం వుందని. యోగాభ్యాసమే వాళ్ళ వృత్తి అని, అలాంటి వారు ఆమండలంలో వందకుటుంబాలవారున్నరని, శ్రీ కావ్య తీర్థ జనమంచి శేషాద్రి శర్మగారు చెప్పినట్లు అనంత కృష్ణ శర్మ గారు రాశారు. తంజావూరు రాజాంత:పురంలో 'వేమన' చిత్రపటం వుందట.

**" నాలుగో కథ "**

కొండవీటిని రెడ్డి రాజులు పాలించే రోజుల్లో వేమన పూర్వీకులు 'మూగ చింతపల్లి' నుంచి కొండవీడుకు చేరివుటారని, ఆ కాలంలో రాజుల కొలువులో పని చేసిన ఉన్నతోద్యోగులు తమ పిల్లలకు ఆ రెడ్డి రాజుల పేర్లు పెట్టుటం అలవాటుగా వుండేదని,ఆదనంగా వేమన పూర్వీకులకు రెడ్డి పదంచేరి వుంటుంది,అని వేమన దాకా పాకి వుంటుందని,కొండవీటి పడమటి వీధిలో శివాలయం వుండేదని,దాని దగ్గర్లో వేమన ఇల్లుండేదని పండిత బండారు తమ్మయ్యగారు అభిప్రాయపడ్డారు.

**" ఐదో కథ "**

బ్రౌను వేమన వాడిన మాండలీకాలను పరిశీలించి 'తెలంగాణ' లోని నైరుతి ప్రాంతంవాడని భావించాడు.ఇది నిజం కాదని తేల్చాడు మేజర్ మేగ్డోనాల్డ్.రాయలసీమవాడని తీర్పు చెప్పాడు.మూగచింతపల్లి చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలో మాత్రమే వుందని,ఆరుద్ర పరిశోధనలో తీర్పు చెప్పారు.

చాలా జిల్లాల్లో ఆ పేరిటవూళ్ళున్నట్లు తెలుస్తోంది.'వడ్లలో ఎన్ని రకాలున్నయో,రెడ్లలోనూ అన్ని భేధాలున్నయి' అందుకే తాను "కాపు" అని చెప్పుకున్నాడని అంటారు కొందరు – దీనికి ఉదాహరణగా "కలియుగమున నున్న కాపుకులానికు/వేమన తన కీర్తించె " అన్న పద్యం చెప్పారు.'కాపురెడ్లు' గా వేమన వంశాన్ని భావించారు. కృషీ వలుడన్నారు.

**" అందరికి తెలిసిన కథ "**

వేమన చిన్నతనంలోనే తలి దండ్రుల్ని కోల్పోయాడు. అన్న రాచవేమన, ఒదిన నరసమాంబ,చాలాగారాబంగా పెంచారు.వదినంటె వేమనకు తల్లితో సమానం,ఆమె మాట దాటే వాడు కాదు. అన్న వదినల కూతురు 'జ్యోతి'.వేమన్నే కొడుకు వదినకు.అన్న గ్రామాధికారి, పనుల వొత్తిడిలో వుండేవాడు.తమ్ముడి సంగతి పట్టేది కాదు.దానితో చదువు అబ్బలేదు.కొండవీడు దేవాలయంలో దేవదాసితో పరిచయం పెరిగి ఆకర్షణలో పడిపోయాడు.వేశ్య తల్లికి డబ్బు పిచ్చి,ఎలాగైనా వేమన నుంచి డబ్బు గుంజాలని చూసింది.అన్న చాటు బిడ్డ వేమన.ఏమి యిచ్చే పరిస్థితి కాదు.తల్లి కూతుర్ని ఒత్తిడి చేస్తోంది చివరికి ఒదిన నగలు కాజేశాడు.జ్యోతి తల్లి నగలు పెట్టుకుంటానని ఒక రోజు కోరింది.పెట్టె చూస్తే నగలన్నీ ఖళీ. అన్నకు తమ్ముని విషయం తెలిసి ఇల్లు వదిలి వెళ్ళమని శాసించాడు.నిర్లిప్తంగా భయటకు వచ్చాడు.కొడుకుని పోగోట్టుకున్న
తల్లి లాగా భాధపడింది ఒదిన.వేమన పై ఆమెకు మమకారమే కాదు, మారి మంచి వాడవుతాడన్న నమ్మకం బలంగా వుంది.

వేమన్నకో వరుస మరదలుంది.పేరు లక్ష్మి .బావను పెళ్ళాడాలని వుబలాటం.ఈయనకు ఆథ్యాసే లేదు.ఇంట్లో చేరి వలపు చూపులు రువ్వింది.ఏంచలనం లేదు.వదిన ఆమెకు ఆసరాగా వున్న కథ ముందుకు





కదల్లేదు.పెళ్ళిమాట యెత్తి భాధించద్దని కోరాడు దేవదాసిని పెళ్ళి చేసుకున్నానని చెప్పాడు.ముత్తైదు చిహ్నంగా ఒదిన ముక్కెర యిమ్మన్నాడు.అదొక్కటే తనకు మిగిలిందని,అదే తమ పెళ్ళి గుర్తని నచ్చ చెప్పింది.ముత్తైదువు ముక్కెర తీసివ్వదని చెప్పింది.తన చివరి కోరిక ముక్కెరేనని తేల్చి చెప్పాడు.ఆమె ఒక షరత్తు పెట్టి ముక్కెర యిచ్చింది.విచిత్రమైన షరతు.దేవదాసి నగ్నంగా వెనక్కువాలి ముక్కెర తీసుకునేట్లు చేయ్యమంది.పరుగున ప్రియురాలి దగ్గరకు చేరి ముక్కెర యిచ్చి ,షరతు చెప్పాడు.అలానే చేసింది.దిమ్మతిరిగింది ఆమె రూపం చూసేసరికి రక్త మాంసాలతో వున్నతోలు తిత్తి కోసం,వెర్రిగా యింత కాలం వెంపర్లాడానని తెలుసుకున్నాడు.తల్లిగా చూసే ఒదిన కన్నులు తెరిపించిందని అర్ధం చేసుకొన్నాడు. వెంటనే ఆ ముక్కెర వదిన పాదాల చెంత వుంచి కన్నీరు మున్నీరుగా విలపించాడు. జీవితం పై రోత కల్గిందాయనకు. వేశ్య పై విముఖత యేర్పడి దారిలో పడతాడు అనుకున్న ఒదినా ఆశలు నిరాశలయాయి. తల్లడిల్లిపోయింది.మౌనంగా వుండేవాడు.దేన్ని పట్టించుకోవటంలేదు.జ్యోతిని ప్రేమగా పల్కరించటం లేదు.

తనవల్ల యిల్లంతా దివాళాతీసింది.ఒదిన బోసిమెడతో వుండటం చూడలేకపోయాడు.బంగారం తయారుచేసి ఒదిన వొళ్ళంతా బంగారు నగలతో నింపేయలన్న ఆలోచన మన సంతానిండిపోయింది. స్నేహితుడు అభిరామయ్య స్వర్ణకారుడు.అతని తో కలిసి ఆలోచించేవాడు.అభిరాముడు దూరంగా కొండ గుహలో వుండే 'లంబికాశివయోగి' కి రోజూ చెంబులో పాలు యిచ్చివస్తుండే వాడు.దీన్ని రహస్యంగా గమనించాడు వేమన.అభిరామాచారి జ్వరపడి,యోగి కి పాలు యిచ్చి వచ్చే పనిని వేమనకు అప్పగించాడు.యోగి వచ్చిన వాడు అభిరామయ్యే అనుకున్నాడు.రోజు పాలు తెచ్చి యిస్తున్నందుకు 'అమృతదానం' చేస్తానన్నాడు.తాను అభిరాముణ్ణి కాదు అని వేమన చెప్పలేదు.యోగి కనులు

మూసుకొని ,ఆత్మ సాక్షాత్కారం చేసుకొని,వేమనకు మోక్ష వివరాలు తెల్పాడు.పరోపకార్యంలో జన్మ సాఫల్యం చేసుకొమ్మని దీవించాడు.జనానికి జ్ఞన బోధ చేయమని,మానవసేవ మాధవ సేవయని బోధించాడు.అప్పటికి స్పృహలోకి వచ్చి తాను అభిరాముణ్ణి కాదని నిజం చెప్పాడు."నేను అనేది ఆత్మకాని శరీరం కాదు.ఆత్మకు బంధవ్యాలు లేవు. సర్వం శివమయం.రేపురావద్దు,నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను" అని అభిరామునికి ఆశీస్సులందించానని చెప్పి వెళ్ళి పోయాడు యోగి. అజ్ఞాని తిరిగితే నష్టం – జ్ఞాని తిరగక పోతే నష్టం అని విజ్ఞాన కాంతిని ప్రసరిస్తూ,చీకట్ని చీలుస్తూ సంచారం చేస్తూనే వుండమని చెప్పాడు.

ఆ కొండ మీదే చెట్టు కింద కూర్చుండిపోయాడు వేమన,అభిరామయ్య వచ్చి అసలు విషయం తెలుసుకున్నాడు.ఆశ్చర్యపడ్డాడు."కామికాని వాడు కవి కాడు,రవి కాడు/కామికాకమోక్ష గామి కాడు" అని వేమన తత్వోపదేశం చేశాడు,వేమన మారిన విషయం పై ప్రశ్నించిన అభిరామయ్యకు.తను చేసిన తప్పుకి దిద్దుబాటుగా,నాల్గు చరణాల ఆటవెలది పద్యానికి మకుటంగా 'విశ్వదాభిరామ వినురవేమ' అని తాను అభిరాముని వేమనగా ప్రకటించుకోన్నాడు కృతజ్ఞతగా. మూడో పాదంగా "కామియైనవాడు కవియౌను రవియౌను" అని అద్భుతంగా భావంతో సాంద్రం చేశాడు.ఇక ఇంటికి వెళ్ళలేదు – ధ్యానం – మౌనం – అవసరమైతే పద్యంతో పలకరింపు.దేశాటనం చేశాడు.తమ్ముని సంగతివిని అన్న బాధపడి,ఉనికి తెలుసుకొని రమ్మని బ్రతిమాలాడా.పిచ్చినవ్వే తమ్ముని సమాధానం.అన్న వెళ్ళాడు.ధ్యానంలో లీనం అయినాడు వేమన . తర్వాత దేశసంచారం. శిష్యులు పోగయారు.సందర్భనుసారంగా పద్యాలు చెప్పాడు.చివరికి గుహలోకి వెళ్ళి జీవ సమాధి చెందాడు.

వేమన సినిమా వచ్చింది. చిత్తూరు వి.నాగయ్య గా నటించి జీవించారు.కె.వి.రెడ్డి అద్భుతంగా చిత్రీకరించారు.ఆసినిమా కథ కూడ





యిలానేవుంది.వేమన కథను 'మలయశ్రీ' అనే రచయిత నాటకంగా మలచి ,దర్శకత్వ వహించి,తాను వేమన పాత్ర ధరించి అనేక ప్రదర్శనలిచ్చారు.ఆయనదీ యిదే కథ.కరీంనగర్ 'కళభారతి'లో,జూనియర్ లెక్చరర్ల రాష్ట్ర సదస్సులో మొదటి సారిగా యినాటకాన్ని ప్రదర్శించి,ప్రశంసలు పొందారట.

వేమన కథలో కొంత మార్పు చేసి శ్రీ చిల్లర భావనారాయణ గారు 'యోగివేమన' పేరులో చారిత్రాత్మక నాటకాన్ని వ్రాశారు.వేమనగా నటించిన పద్మ శ్రీ నాగయ్య గారు ప్రశంసలనందుకున్నారు. నాటక ప్రయోక్త శ్రీ సుంకర కనకారావు గారు యినాటకాన్ని రంగ స్థలం పై ప్రదర్శించటానికి ప్రోత్సాహించారు.నటుడు శ్రీ వి.సత్యనారాయణరాజు గారు వేమన పాత్రపోషించి సెహబాష్ అనిపించుకున్నారు.'భారతీనాట్య మండలి దీన్ని అనేక ప్రదర్శనలిచ్చింది ఆంధ్ర దేశంలో. కథలో మార్పులు – దేవదాసి పేరు 'మదాలస' .విలాసయ్య అనే విలన్,వేమన పతనానికి కారణుడు.వేమన ఒదిన పేరు 'సీతాంబ'.అన్న అనవేమారెడ్డి.వేమన్న బంగారం చేస్తాను అంటే మదాలస ఒప్పుకోదు.ఆమె అతన్ని ఆరాధించింది.వేమన కూడా ఆమెనే శృంగార రస రూపిణిగా,తన కావ్యాధి ష్టాన దేవతగా భావించాడు.మదాలస తాను శారదనని,వేమన జగతికి స్రష్ట అని,ఆయన తమ్మికంటి అని తాను గిరిజనని,ఆయన కాలకంధరుడని చెప్పింది.ఆమె కూడా వేమన వాల్లభ్యసౌభాగ్యాన్ని ఆశించాను కాని రాచరికభోగభాగ్యాలను ఆశించలేదని ప్రాధేయపడింది,తమ వృత్తి పవిత్రమైన కళాతపస్సు అంది. జగదేకసుందరి ఆకళామతల్లి తన ఇలవేల్పంది.వేశ్యలు వివాహం ఎందుకు చేసుకోరాదని ప్రశ్నించింది.సానివాళ్ళ తెగ నిర్ణయించినట్లు పరదారాగమనం వున్న విటులకూ ఓ తెగ ఎందుకు నిర్ణయించ లేదు? అని అడిగింది.వేమన శిక్ష రద్దు చేయమని కోరింది.రాజుకిచ్చినమాట ప్రకారం మరునాడే ఆ ప్రదేశం వదిలేసింది. అనవేముడు చకితుడై 'దేవదాసి కులంలో

తప్పు బుట్టింది. అని మెచ్చాడు. వేమన శివబ్రహ్మం అనే వాడిని బంగారం చేసే రహస్యం చెప్పమని అడగితే,ఆరహస్యం చెబితే 'పసి పిల్లవాడి చేతికి పదునైన కత్తి నివ్వటం లాంటిది'అని , ఒక బంగారు హారం యిచ్చి పంపేస్తాడు. తర్వాత మదాలస వేమనను ఎప్పుడో కలిసి యిలోకపు దుస్తంత్రాన్ని, దురాచారాలని అందరికి తెలిసేలా చాటి చెప్తూ ఆట వెలది అయిన తన్ను కావ్య ప్రతిభతో చిరంజీవిని చేయమన్నది. తన నాలుక మీద ఆటవెలది నిత్యం నాట్యం చేస్తుందని వాగ్దానం చేశాడు. పై రెండు నాటకాలు అర్ధవంతమైన సంభాషణలతో వేమన జీవితాన్ని,కవిత్వతత్వాన్ని ఆవిష్కరించాయి. రససిద్ధి కలిగించాయి మనో విజ్ఞానాన్ని పెంచాయి అంతకు చాలా కాలం పూర్వమే"పంచనాదం"గారు నాటకం వ్రాసి బహుళ ప్రాప్తి చెందించారట.

## " డూప్లికేట్ వేమన "

"బాల చక్రవేమ భవ్యనామ" మకుటంతో వందకు పైగా పద్యాలు రాసిన "తుంగవేమన" నుమన వేమన గాభ్రవించారు. ఆయనేయియన అనిప్రచారమూ జరిగింది. కొన్ని పద్యాలు 'విశ్వదాభిరామ' మకుటంతో అందులో చేరాయట. ఇతడు శర్వరి నామ సంవత్సర చైత్రశుక్లనవమి రోజున చనిపోయాడట. ఇద్దరి జనన,మరణకాలాలు ఒక్కటే అవటం భ్రాంతికి కారణం. తుంగ వేమన తన గురించి పద్యం చెప్పుకున్న కథ తనదే అని అభిప్రాయం తుంగ వేమన 1869 లో చనిపోయినట్లున్నది. ఇలా సందట్లో సడేమియాలా తుంగ వేమన, మన వేమన సరసన డుప్లికేట్‌గా తుంగచాప పై కూర్చున్నాడు.

## రసవాదం

ఎవరు వేమన్న గురించి యే కథ చెప్పినా అందులో వస్తువుల్ని బంగారంగా మార్చే 'పరుసవేది ' గురించి చెప్తూ వస్తున్నారు. దీన్ని రసవాదం





అంటారు. హేమకార విద్యగా కూడా పేరు. రసవాద శాస్త్రజ్ఞులు బంగారం చేసే ప్రక్రియలు కొన్ని చెప్పారు. అసలు బంగారం కాకపోయినా, దానితో సమానంగా వుంటుందట. అందులో ఒక పద్ధతిలో. 800 గ్రాముల రాగి, 28 భాగాల ప్లాటినం, 20 భాగాల అసలు బంగారం కలపాలి. అప్పుడు బంగారం తయారవుతుంది. రెండో పద్ధతి ప్రకారం వెండి 2.48 భాగాలు, ప్లాటినం 32.02 భాగాలు, రాగి 65.50 భాగాలు కలిపి కరిగించితే బంగారం తయారు. మూడో విధానంలో 16 భాగాల రాగి, 7 భాగాల ప్లాటినం, 1 భాగం జింక్ కలిపి కరిగిస్తే 16 కారెట్ల అంటే పదారు వన్నె బంగారం తయారవుతుంది. సాధారణంగా నైట్రిక్ ఆసిడ్ కూడా దీన్ని యేమీ చేయలేదట. ఆధునిక కాలంలో పరమాణు రహస్యం తెలిసిం తర్వాత చివరి కక్ష్యలో వున్న ఎలక్ట్రాన్ల సంఖ్యను మారిస్తే ప్రతి ధాతువు యింకో ధాతువుగా మార్చవచ్చని తెలిసింది. ఇలా వచ్చే బంగారం చాలా ఖరీదైనదిగా వుంటుంది.

అయితే వేమన కాలంలోను అంతకుముందు కూడ బంగారం తయారు చేయటాన్ని గురించిన చెప్పిన శాస్త్రాలున్నాయి. అందులో 1) మందాన భైరము 2) రసగంగాధరం 3) రసేంద్ర చింతామణి 4) రస రత్న సముచ్చయం ప్రసిద్ధి చెందిన గ్రంధాలు.

ఇవన్నీ విన్న, కన్న వేమన్నకు బంగారం చేయాలన్న కాంక్ష వుండి వుండచ్చు. ఆ విషయంలో వేమన కొన్ని పద్యాలు చెప్పాడు. "నిమ్మ పండు పుట్టె నిజమైన రసముండె / హేమమునకు నేడ్తురేల ప్రజలు / సత్తు పొత్తు చేసి సాధింపరేలకో / అని బంగారం చేసే తేలిక విధానం చెప్పాడు. ఇంకో పద్యంలో కూడ "ఇంగిలీక మహిమ హేమింపనేరక / చిత్రపటము వ్రాసి చెరచినారు / బొంత జెముడు పాల బొంగించ నేరరు / " ఇవన్నీ చూసి బంగారం సాధించాలని చాల మంది యోగులు ప్రయత్నం చేసి చేయి కాల్చుకున్నారు. చింత నిప్పుల

బూడిదలో బంగారం తయారు చేయవచ్చని, తాళకము రంగు, పాదరసం, రాగిలలో హేమాక్షి మొదలైనవి కలిపి బంగారం చేయచ్చుననే వాదమూ ప్రచారంలో వుండేదని, యీ వివరాలన్నీ పొందుపరచారు నేదులూరి గంగాధరం గారు.

ఆచార్య నాగార్జునుడు రసవాద సిద్ధాంత కర్త అని అందరికి తెలుసు. మహాభారతంలో దుర్యోధనుడికి పరుసవేది విద్య తెలుసునని, అదే అతని బలం అని వుంది. భట్టి విక్రమార్క కథల్లోనూ దీని ప్రస్తావన వుంది. కాకతి ప్రతాపరుద్రునికీ పరుసవేదిని అంటించింది ఐతిహ్యం. రవీంద్రుని తండ్రి దేవేంద్ర నాథ ఠాకూరు కూడా బంగారం చేయటానికి బహు ప్రయాస పడ్డారని చెప్పుకుంటారు. కాంతా వ్యామోహం కంటె కనకంపై వ్యామోహం ఎక్కువన్నమాట. ఇంత కథా కమామీషు వుంది స్వర్ణ కార విద్య మీద. సరే దీన్ని యింతటితో వదిలేద్దాం.





# కొండవీటి వైభవం

"పరరాయ పరదుర్గ పరవైభవ శీల / గొన కొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల బంధించు / గురుతైన యురితాడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు బుట్టించు / కొమరు మీరిన వీడు కొడవీడు
చటుల విక్రమ కళా సాహసంబొనరించు / కుటిలాత్ములకు సూదు కొండవీడు
సాధు సైంధవ భామినీ సరసవీర / భటన టానేక హాటక ప్రకట గంధ
సింధురాద్భుత మోహన శ్రీలదనరు / కూర్మిన నమరావతికి జోడు కొండవీడు."

అని శ్రీనాథ మహా కవిచేత ప్రశంసలు పొందింది కొండవీడు. ఆ కొండవీడే వేమనకు స్థానమైంది. "కొండవీటి దండ కవిలె " లో దాని విశేషాలన్నీ వున్నాయి. 'కొండవీటి కై ఫీయట్ ' కూడా చరిత్ర చెప్పింది. కొండ కోనప్ప అనే అతడు దండ కవిలె సంపాదించినాడట.

గుంటూరు జిల్లాలో నర్సరావుపేట దగ్గర వున్న అరణ్యంలోని కొండవీడు. అక్కడొక ఎతైన పర్వత దుర్గం వుంది. ఎత్తు 1725 అడుగులని, చుట్టుకొలత 30 మైళ్ళని తెలుస్తోంది. ఈ పర్వతానికి 50 శిఖరాలున్నాయట. వెంకటేశ్వర ఆలయం, కన్య కల బావి, శివాలయం వున్నాయి. శిఖరాలను "బోడు"లంటారట. వీటిలో 6 గుహలున్నాయట. పర్వతంపై పెద్ద చెరువులు మూడున్నాయట. 36 స్థంబాల పెద్ద మండపం వుందట. శిధిలమైన రాజమందిరాలు చాలా వున్నాయట. మహ్మదీయులు కట్టించిన నమాజుచేసే మందిరాలున్నాయట. 6గ 4గ 1 1/2 గజాల రాతినేతి తొట్టెవుందిట. నెయ్యి పోసుకొనేవారట దీంట్లో రెడ్డిరాజులు. 24 స్థంభాలు, 22 స్థంబాలున్న మండపాలున్నాయట. గణపతి, సుబ్రహ్మణ్యస్వామి గుడులున్నాయట. నాగ కన్యల

విగ్రహాలున్నాయట. కొండగుహలో పాను వట్టంపై శివలింగం వుందట. ఇవన్నీ చదునైన ప్రదేశంలో వుంటే దీని చుట్టూ పర్వత శిఖరాల మీద కొండంతా వ్యాపించి వుండే కోటలుండి, శత్రుదుర్భేద్యంగా వుండేవట. నృసింహాలయం వుంది. రెండస్థుల ద్వారం ఆశ్చర్యం కల్గిస్తుందట. దీనికి తూర్పున రెండు వరుసలున్న 16 స్థంభాల మండపం వుంది. దీన్ని "యోగి వేమన మండపం " అంటారట. తూర్పున అంబగుడి వుంది. పర్వతానికి దక్షిణాన గంజికాలువ, దాని దగ్గర గంగాధర రామేశ్వరాలయం వున్నాయి. ఆలయ స్థంభం మీద శ్రీరంగ రాయలవారి శాసనం వుందట. కొండపై మసీదులు రెండున్నాయి. కొండల మధ్య వున్న గుహలో ' కొండ సింగరయ్య ' అనే నృసింహస్వామి దేవాలయం, దీని బయట నవులూరి పోతరాజు, నాగవరమ్మ గుళ్ళున్నాయి. పోతరాజు గుడినే శ్రీనాథుడు "గృహరాజు మేడ " అన్నాడట.

కొండదిగితే కోట అని పిలువబడే గ్రామం. దీనికి దక్షిణంలో గోపీనాథస్వామి ఆలయం రమణీయంగా వుంటుంది. దీని ప్రక్కన వేయి కాళ్ళ మండపం శిథిలావస్థలో వుంది. ఇప్పుడిది మసీదుగా మారింది. దీని కెదురుగా 20 గజాల ఎత్తు రాతి ధ్వజస్థంభం వుంది. సదాశివరాయల శాసనాలిక్కడ వున్నాయి. గుడికి దక్షిణంలో శిథిల శివాలయం, అందమైన నంది వున్నాయి. నంది కడుపులో వరహాలు వుండేవట. దొంగలు తోకదగ్గర కన్నం చేసి దోచేశారట. 'లంకెలబావి ', 'వసంతఘర్ " అనే రాజమందిరాలు కూడా శిథిలాలుగా వున్నాయి.

పుట్టకోట సమీపంలో రెడ్డిరాజులు కట్టించిన "రంగనాయక " ఆలయంవుంది. దీనిలో నాగేంద్రుని విగ్రహం చెక్కు చెదరకుండా వుంది. దగ్గరలో మాణిక్యాల రావు కోనేరు వుంది. అంత :పుర స్త్రీలు సహగమనం చేయటానికి గుండాలున్నాయి. గృహరాజు మేడ దిబ్బల దగ్గర " జడ్డిగలబావి " వుంది. ఇది



జనవేమన

గృహరాజు మేడలోని " శ్రీ ఆదిలక్ష్మీ కామేశ్వరి అమ్మవారు " జలక్రీడ చేయటానికి ఉపయోగపడేదట. దీనికి దక్షిణాన పెద్ద చెరువుంది. రెండు పెద్దతోటలున్నాయి. చెరువు కట్టమీద వేణుగోపాలస్వామి గుడివుంది. కొండల క్రింద 'తిరుమల లక్ష్మీ నరసింహస్వామి " గుడివుంది. పడమర రామేశ్వరాలయం, తూర్పున గోపాలస్వామి గుడి వున్నాయి. పడమర 'సీతాపతి ' అనే రాతి మూతిగల చెరువుంది. కొండవీటికి ఉత్తరంగా వీరభద్రాలయం " పొదిలె రహిణా సాహెబుదర్గా " అనే 3 గోరీ మండపాలున్నాయి. దీనికి ఉత్తరాన 'పతేఖాన్ మసీదు', 'భోజరా ' అనే అత్తర్ చౌదరి మసీదు, "సురుఖానా " మసీదు, "నల్ల మసీదు ", గుమ్మల్ మసీదు, జామతానా మసీదు, "చిన మసీదు" లున్నాయి. ప్రస్తుతం వున్న కొండవీటికి దక్షిణంలో రెండు మైళ్ళ దూరంలో " శిఖవస్ ఖాసుపేట" అనే వూరుంది. అక్కడ శ్రీ వెన్న ముద్దుకృష్ణ స్వామి ఆలయం వుంది. కొండవీటి రాజులు కట్టించింది. పోలయ వేమరాజు "చదలవాడ రాఘవాలయం "ను, నాదెండ్ల గోపయ్య " రఘునాయక ఆలయం " నిర్మించారు. కొండవీటి కోటను 800 సంవత్సరాల క్రిందట "విశ్వంభరరాజు " నిర్మించాడట – కొండపైన అరకోట, పిల్లకోట, పెదమూలెంకోట, చినమూలంకోట, తట్టుకోట అనే 5 కోటలుండేవి. వీటికి రహస్య ద్వారాలున్నాయి. ఈ కోటల గుండా పైకి పోయే దోవను "ఖిలైదర్వాజా " మందిరం వుంది. కొండ కింద పడమర 1 1/2 మైళ్ళ చుట్టుకొలత వున్న కోట, దాని చుట్టూ 50గ 10గ లోతువున్న అగడ్త వుంది. ఈ కోటను రాయని భాస్కరుడు కట్టించి, గోపీనాథ పురగ్రామాన్ని, ఆలయాన్ని నిర్మించాడు. రాయని భాస్కరుని ప్రస్తుతిస్తూ పద్య మొకటి రాతి మీద వుంది. దీన్ని "కొండపల్లి గవ " అంటారు. దక్షిణ ద్వాయం " నాదెండ్ల గవని".

కొందరు ఉత్తరాన కొండల మధ్య " పుట్టకోట " వుంది. ప్రోలయ వేమారెడ్డి కట్టించాడు. "గుండిన నగరం " యిందులోనిదే నంటారు. పర్వత

సోపానాలకు ఉత్తరాన తారాబురుజులతో 5 కోటలున్నాయి. మొత్తం 25 బురుజులున్నాయి. ఇంత ప్రశస్తి చెందిన కొండవీడులో శిల్ప, రసవాద, ఆయుర్వేద, యోగ, తాకిల, రాజకీయ, వేదాంతాలను జ్ఞానియై పొంది, యోగియై ప్రవర్తించాడు వేమన. స్థల మహాత్యం కూడానేమో ?

## వేమనపై ప్రసరించిన వెలుగు చీకట్లు

వేమన కవిత్వానికి ముగ్ధులై ప్రశంసలజల్లు కురిపించిన పాజశ్చాత్యులలో మొదటివాడు ఫ్రెంచి దేశానికి చెందిన మత గురువు జె.ఎ. దుబాయ్. "ఉదార వేదాంత విషయాలను వ్రాసిన హిందూ రచయితలలో అందులో హిందూ మతాచారాలను విమర్శించిన వారిలో, ఒక్క బ్రాహ్మనుడూ లేదు. ఇలాంటి విమర్శ గ్రంధాలు వ్రాసిన వారిలో బ్రాహ్మణేతర కవులే వున్నారు. అలాంటి వారిలో తిరువళ్ళువరు, అగస్త్యుడు తమిళులు. సర్వ విజ్ఞాన మూర్తి కన్నడగుడు. తెలుగులో ప్రఖ్యాత కవి వేమన. ఆయన రాసినవి ఇతర భాషల్లోకి ప్రవేశించాయి. ఆయన రచనలు చిత్తాకర్షణంగా, సూక్ష్మ బుద్ధితో చేసిన విచారముగ, స్వతంత్ర భావో పేతంగా, ఒక ప్రత్యేకతలో వున్నాయి. " అని కీర్తించాడు. 'హెన్రీ బ్యూఛాంప్ ' అనే ఆయన దుబాయ్ వ్రాసిన దానికి అనువాదం చేసి ప్రచురించాడు. విలియం చెంటిక్ ప్రభువు ఆ ప్రతిని చూసి మెచ్చి " సమైక్యతకు బాగా తోడ్పడుతుంది " అని కితాబిచ్చాడు. ప్రభుత్వం చేత ఆ పుస్తకాన్ని కొనిపించి, ప్రచురించే కార్యక్రమానికి నాంది పలికాడు. దుబాయికి 8000 రూ. బహుమానంగా యిప్పించాడు లర్డ్ బెంటిక్.

సి.పి. బ్రౌన్ మద్రాస్ సివిల్ సర్వీస్ ఉద్యోగం చేశాడు. భాష మీద ఆయనకు శ్రద్ధ కలిగింది. తాటాకుల మీద వున్న వేమన పద్యాలను సంగ్రహించి, సవరించి ముద్రణ చేసి మహోపకారం చేశాడు. 693 పద్యాలను ఆంగ్లంలోకి





అనువదించి తాత్పర్యం వ్రాసి ముద్రించిన మొట్టమొదటి వ్యక్తి. ప్రతి ఫలా పేక్ష లేకుండా తెలుగు భాషకు చేసిన బ్రౌన్ సేవ చిరస్మరణీయం. లాటిన్ భాషలోకీ అనువదించాడు. "ది వర్సెస్ ఆఫ్ వేమన. మోరల్, రిలీజియస్ అండ్ స్టాటిటిషియల్ అన్నీ పేరులో ఆంగ్లంలో ప్రచురించాడు. వేమనతో సరి తూగగలవాడు గ్రీకు దేశీయుడైన " లూసియన్ ( .......) ఒక్కడేనన్నాడు. " గ్రీకు వాఙ్మయంలో లూసియన్‌లా, తెలుగు సాహిత్యంలో వేమన తెలుగు భాషా సాహిత్య ప్రారంభకులకు ఉపకారి ' అన్నాడు. బ్రౌన్ వల్లే మన పండితులు వేమనకు గుర్తించారు. ఆయనే మతం, నీతి, వ్యంగ్యం, తాత్వికం, ప్రకీర్ణం అనే వర్గాలుగా వేమన పద్యాల్ని విభజించాడు.

అబే దుబాయ్ వ్రాసిన " హిందూ మేనర్స్ కష్టమ్స్ అండ్ సెరిమనిస్ " అనే పుస్తకానికి సంపాదకీయం వ్రాసిన పోప్ అనే దొర "వేమన పద్యాల మాధుర్యాన్ని అను ప్రాస యమకాలలయని మించిన మరో కవిత లేదు " అని పొగిడాడు.

మే క్డొనాల్డ్ "వేమన రచనలు విదేశీయులను ఆకర్షించినంత గొప్పగా, తెలుగు సాహిత్య మంతటిలో మరొక కవి రచనలు ఆకర్షించలేదని చెప్పవచ్చు " అని మెచ్చాడు.

ఛార్లెస్ ఇ. గోవర్ అనే అనువాదకుడు "వేమన తిరువళ్ళువర్ కంటె తక్కువ, కవిత్వంలో స్థాయి యింకా తక్కువ " అని చీకట్లు కుమ్మరించాడు. "ది ఫోక్ సాంగ్స్ ఆఫ్ సదరన్ ఇండియా " అనే పుస్తకంలో వేమనవి నాలుగు పద్యాలను ఎన్నిక చేసి వేశాడు.

వేమనపై చక్కని వెలుగు ప్రసరింప జేసింది 'క్యాంబెల్'. "వేమన ప్రజల కవి. ఆయన వ్రాసింది నిరక్షరులైన గ్రామీణులకు. ఆయన ప్రలోభాలే కాదు,

ఆయన శైలీ శక్తి వంతమైందే. పండితుల ప్రశంసలను పేరు ప్రతిష్టలను కోరలేదు. సంప్రదాయ కవితానియమాలను ఉల్లంఘించాడు. వ్యంగ్యసూక్తి వైచిత్రవల్లే వేమన ప్రజాదరణ పొందాడు. తోటి ప్రజలకు సేవ చేయాలన్న తీవ్రకొంక్ష వున్న సంస్కర్త. అతనిది ఆస్తిక భావం. మానవ శక్తికి ఒక స్థానాన్ని సంపాదించాడు. లూథర్, విల్ క్లఫ్‌ల వంటి మత సంస్కర్తలు వేమనకు సాటిరారు "అని మనస్ఫూర్తిగా వేమన కవిని అంచనావేసి, ఆతని స్థానమేమిటో నిర్ణయించాడు. కవిగా గుర్తించని వారి కళ్ళు తెరిపించాడు.

డాక్టర్ ఈశ్వరతోపా " సెయింట్ వేమన అండ్ హిజ్ ఫిలాసఫి " అన్న గ్రంథంలో " మానవతా సిద్ధాంతాలను పునాదులుగ చేసి, వేమన తన ఆదర్శ సంస్కరణల భవనాన్ని నిర్మించాడు. ఆత్మ శుద్ధీకరణకు మానవుడు తానే స్వయంగా పాటు పడాలి. మానవునిలో అంతర్గతమైన ఆంతరంగిక శక్తుల్ని వెలికి తీయడంలో ఏ మానవాతీత శక్తి కూడ అతనికి తోడ్పడదు.అయితే సర్వమానవ సంక్షేమార్థం మానవ శక్తుల్ని ఉదాత్తంగా సంస్కరించటం చాలా ముఖ్యం అన్న గ్రహింపు అవసరం " అని వేమన సంకల్పానికి జేజేలు పలికారు.

డాక్టర్. ఎల్.డి. బార్నెట్ " ది హార్ట్ ఆఫ్ ఇండియా – వేమన " అన్న తన పుస్తకంలో "వేమన మానవులకు సంబంధించిన దేనినీ నిర్లక్ష్యంగా చూడలేదు " అని శ్లాఘించాడు.

భారతదేశ చరిత్రను మొట్టమొదటగా వ్రాసిన "విన్సెంట్ స్మిత్ " వర్ణ వ్యవస్థలోని దోషాలను గురించి రాసే సందర్భంలో వేమన పద్యాలను నాల్గింటిని ఉదహరించాడు. ఇవన్నీ ఒక ఎత్తు.

మద్రాసులో ప్రభుత్వం పాఠ్యగ్రంథాలను సవరించి పరిశీలించటానికి మాక్డొనాల్డ్ అధ్యక్షునిగాక మింటే వేసింది. హెన్రీబ వర్సును తెలుగు పాఠ్య పుస్తకాలపై నివేదిక నిమ్మంటే తెలుగు పుస్తకాలలోంచి వేమన పద్యాల్ని పూర్తిగా





తీసేయాలని సిఫార్సు చేశాడు. ఆయన తన రిపోర్టులో " ఒక ఐరోపియనుకు వేమన తన కాలం కంటె ఎంతో ముందు అధిగమించిన వ్యక్తిగా కన్పించును. కాని ప్రభుత్వం హిందూ విద్యార్థులు క్రైస్తవంలోకి కలుపు కునే ప్రయత్నం దీనివల్ల జరుగుతోందనే అపోహకు తావివ్వరాదు " అని చెప్పాడు. డాక్టర్ జె. మురదాక్ కూడా నిషేధించాల్సిందే అన్నాడు. " ప్రభుత్వం ప్రచురించిన పాఠ్య గ్రంథాల్లో బైబిల్ దూషణ మెట్లుండరాదో, అట్లే వేదనింద వుండ కూడదు. స్వజాతి దూషణం గల పద్యాలను ఆ బ్రాహ్మణుల్నే చెప్పమనటం ఉచితం కాదు ". అని భావించాడు.

ఒక చోట మెచ్చిన బార్నెట్ వేమన వెర్రి సన్నాసి అని, పూర్ రిచర్డ్ అని, కల్పిత గ్రామీణ యోగి అని ' మరింత చీకటి రుద్దాడు. ఈనాడు అయిన్ స్టీన్ శాస్త్రవేత్త గాంధీ గారి గురించి " ఇలాంటి మానవుడు భూమి మీద జన్మించిన వున్నాడంటే భవిష్యత్తరాలు ఆశ్చర్యపోతాయి " అని ఆశ్చర్యపోయాడు. అలాగే లూర్నెట్ కూడా " రక్త మాంసాలు మానవ శరీరం ధరించి, వేమన అనే పేరులో, యీ భామి మీద పుట్టి, నిజంగా దాన్ని పవిత్రంచేశాడా ? " అని ఆశ్చర్య చకితుడైనాడట. చివరగా " మానవ హృదయాంతరాళ పరీక్షకుడొకడు, లోక ప్రవక్తల ఉపదేశముల విలువను గట్టను, తూచిన యెడల, ఎందరో ఉన్నతులు, ఎన్నియో మహిమో పేతాత్ములు ఈ తెలంగాణ (వేమన తెలంగాణాలో పుట్టాడని బార్నెట్ భావించాడు ) వినీత వినమ్ర కృషికుని (రైతు) కంటె ఎంతో తక్కువగా తూగినట్లు తెలిసికోగలడు " అని మనస్ఫూర్తిగా మెచ్చుకున్నాడు. ఇలా పాశ్చాత్య వేత్తలు వేమనపై గొప్ప వెలుగును, చిరుచీకటిని కుమ్మరించారు. ఆ వెలుగుల ముందు చీకటి తన అస్థిత్వాన్ని కోల్పోయింది. చివరగా అంతటా తేజస్సే నిండిపోయింది. అదీ వేమన వ్యక్తిత్వ ప్రభావం. వీటన్నిటిని శ్రీ నార్ల వెంకటేశ్వరరావు చాలా తులనాత్మక పరిశీలన చేసి నిక్షిప్తం చేశారు.

# దేశీయులపై వేమన ప్రభావం

వేమన శిష్యులు ఆయన పై ద్విపద కావ్యం వ్రాసి భక్త ప్రకటించుకొన్నారు.వేమన ముఖ్యంగా 7 సిద్ధాంతాలను శిష్యులకు బోధించినట్లు తెలుస్తోంది. 1)దొంగతనం చేయరాదు 2) భూతదయ కలిగివుండాలి. 3) ఇతరులను నొప్పించరాదు 4) ఉన్నదానితో తృప్తిపడాలి 5) మాత్సర్యం కూడదు 6) కోపం వదిలేయాలి 7) ఈశ్వరారాధన సధాచేయాలి. ఇవన్ని సర్వమత సారంగా చెప్పాడు.

వేమనలాంటి వారున్నారా ? అన్న ప్రశ్న సహజంగా వస్తుంది.కొంత పరిశీలించి చూడగా వున్నారని తెలుస్తుంది. కన్నడదేశంలో 1760 లో జన్మించినసర్వజ్ఞుడు వేమన తో సరిసాటి.ఈయనకు తన శక్తి పై అపారనమ్మకం."త్రిపద" అనే గీతాలు రాశాడు . వీటి సంఖ్య 5 వేలట.పెద్దలయడ వినయ విధేయతలు, ఓర్పు వుండాలని భోధించాడు. " సర్వజ్ఞ వేమన సంవాదము " అనే సమానార్ధం వున్న పద్యాలు కన్నడంలో వున్నారట.

మహరాష్ట్రకు చెందిన 'సంత్‌తుకారాం' వేమన వంటివాడే. ఐకమత్యాన్ని,సర్వమత సమానత్వాన్ని బోధించిన కవి,శివాజీకి సమకాలికుడు.1608 లో జననం.4600 లో పదాల గ్రంధం వ్రాశాడు. ఉపనిషత్సారాన్ని భోధించాడు.

తమిళ దేశానికి చెందిన ' అవ్వయ్యార్' చాలా ప్రసిద్ధి చెందిన బోధకురాలు. 1) ఆత్తిసూడి 108 సూత్రాలు 2) కోన్రైవేందన్ 91 సూత్రాలు రచించింది.సుమతీశతకంలా పార్య గ్రంధాలలో వాటిని చేర్చారట. "అవ్వైకురల్" అనే వేదాంత గ్రంధం వ్రాసిందట.





ద్రావిడ కవి "అరుణగిరి నాధుడు" 1465 లో జన్మించాడు. సహజ పాండిత్యం వుంది.వేమనలా వేశ్యాలోలుడై చివరికి జ్ఞానియై "తిరుప్పుహళ్ " అనే 16 వేల పదాలురాశాడట.'కందరనబూతి', 'కందరలంకారం' అనే గ్రంధాలు వ్రాసినట్లుంది. ఈయన భాషా వేమన భాషంతమాధుర్యంగా వుంటుందట.

తిరువళ్ళువర్ "కురళీ " అనే ప్రఖ్యాత గ్రంధం వ్రాశాడు.సత్యం నీతి పాటించాడు.చాలా అద్భుతాలు చూపాడు.1330 పద్యాల గ్రంధం వ్రాశాడు.దీన్ని కను పర్తివెంకట రామ శ్రీ విద్యానందులవారు "త్రివర్గ దీపిక" పేర తెలుగు చేశారట.భావాల్లో వేమన కు సమాద భావాలున్నవాడట.వీరంతా వేమన వంటి ఇతర ఇతర భాషల్లోని మహనీయులైన కవులు.

ఇప్పుడు వేమనను ఎవరెవరు అనుసరించారని ఆలోచిస్తే, ఆయన శిష్యులు, ప్రశిష్యులు చాలా మంది కన్పిస్తారు. పోతూలురి వీరబ్రహ్మం గారు వేమన మతాన్ని అవలంభించారు. యోగ సాధన చేశారు. విగ్రహారాధన నిరశించారు. దూదేకుల సిద్ధయ్య ముఖ్య శిష్యుడు. జాతి బేధం పాటించలేదు. కాలజ్ఞానాన్ని బోధించారు. "సిద్ధ బోధనం " అనే గ్రంధాన్ని వ్రాశారు. కుమార్తె ఈశ్వరమ్మ బ్రహ్మచారిణి. బ్రహంగారి సమాధి 'కందిమల్లయపాలె' లో వుంది. సజీవ సమాధి పొందిన యోగి.

1780లో పుట్టిన తుంగవేమన వేమన శిష్యుడే. వేమన డూప్లికేట్‌గా చెప్పుకొంది ఈయన్నే. "ఏగంటి వచనాలు " వ్రాసిన ఏగంటి లక్ష్మయ్య వేమన శిష్యుడే. ఆయన వచనాలకు మంచి ప్రచారం వుంది.

"ముత్యాల నారసింహయోగి " వేమన మీద భక్తలో "వేమన జ్ఞాన మార్గపద్యములు " వ్రాశాడు. దిగంబరయోగి శిష్యుడు. 'జీవతత్వ ప్రబోధకు సుమావళి " అనే కంద పద్య గ్రంథం రాశాడు.

రాజమండ్రి వాసి "నిట్టల ప్రకాశదాసు " వేమన మార్గాన్ని అనుసరించిన సాధకుడు. గొప్పయోగి. యోగ మహిమలో గోదావరి నీటిపై కూర్చుని అవతలిఒడ్డు చేరిన శక్తిశాలి. పాటలు, తత్వాలు రాశాడు.

తూర్పుగోదావరి జిల్లాకు చెందినవాడు, కాకినాడ వాసి యడ్ల రామదాసు. చాలా గ్రంథాలు రాశాడు. శిష్యులు చాలామంది వున్నారు. పద్యాలు, పాటలు, తత్వాలు రచించాడు. వేమనలాగ కీర్తి పొందాడు. వీటి నన్నిటిని నేదునూరి గంగాధరం గారు విపులంగా వివరించారు.

ఎడపాటి ఎఱ్ఱాప్రగడ కవి తన 'మల్హణ చరిత్ర 'లో, తురగా రామకవి "నాగరఖండం "లో పింగళి ఎల్లన "తో భ్య చరిత్ర " లో వేమన్న గురించి వ్రాశారు.

వేమన పద్యాలు 150లను ఆంగ్లభాషలోకి సరళంగా అనువదించి ప్రచురించారు శ్రీ ఎ.ఎల్.ఎన్.మూర్తి 1978లో.

విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి 'వేమన – వేయి పద్యాలు " పేరిట వేమన కవితా విశేషాలను, వ్యక్తిత్వాన్ని కీర్తిస్తూ " విశ్వవినుత చర్య ! వేమనార్య " మకుటంతో గొప్ప పద్యాల పందిరి వేసి, వేమన యోగికి స్థానం కల్పించారు. మచ్చుకో పద్యం – " నీదు కవితా స్రవంతిలో నిశిలభావ / జీవరత్నాల వెలుగులు చిందులాడ / వెలుగుగనలేని చీకటి పులుగులెల్ల / దొలిగి పోయిన నీకేమి దొసగుపొసగు " / ఈ విధంగా ఆనాడే కాదు, 400 సంవత్సరాలు దాటినా వేమన్నంటే భక్తి, అనురక్తి, ఆసక్తి, వ్యాసక్తి తగ్గలేదు. జనం నాలుకపై వేమన నిత్యం నర్తిస్తూనే వున్నాడు. అందుకే కట్టమంచి రామలింగారెడ్డి "తారకలలో ధృవతార " వేమన అనటం సముచితం. "శతక కవిరాజు " అన్నారు రాజా ఎమ్. భుజంగరావు. ఆంగ్లంలో పోప్ వ్రాసిన "హీరోయిక్ కప్లెట్స్" ఎంత





ప్రచారం పొందాయో, వేమన ఆటవెలది అంత సర్వాంగ సుందరంగా వుంది " అన్నారు నార్ల. ఆంగ్లంలో "రాబర్ట్ బర్న్స్ " కవిలా వేమన గ్రామీణ కవి, స్వయం సమృద్ధమైన ఉదాత్త సంప్రదాయాన్ని సృష్టించాడు. భావోద్వేగం పొంగి పొరలిన గడియలలో ఆవిర్భవించిన కవిత ఆయనది. ఉపమానాలు వేమన కవితలో సూక్తులుగా వుండి నవ్యత, నాణ్యత పొందాయి. ఆటవెలదిలోని మూడో పాదాలు తెలుగు సామెతలుగా చెలామణి అయాయి. వ్యాజస్తుతి, వ్యంగ్య పరిహాసం వేమన సహజప్రకృతి. "చురుక్కు మనిపించే వాడి దనం నుండి మృదువైన పరిహాసంగ, సరళమైన వ్యంగ్యంగ, తియ్యని హాస్యంగ దశలవారిగ వేమన శైలి మారుతుంది. " అని కట్టమంచి కొట్టొచ్చినట్లు మెచ్చి యిచ్చిన కితాబు మతాబే. జర్మన్ కవి "గేథే" ను గురించి మాథ్యూ ఆర్నోల్డ్ "బాధిత ప్రజానీకానికై పాటుపడ్డాడు. వారి ప్రతి గాయాన్ని, ప్రతి బలహీనతను పరిశీలించాడు " అన్నమాటలు వేమనకూ వర్తిస్తాయి. 'సహజ హాస్యచతురుడైన గ్రామీణుడు ప్రకృతి దార్శనికుల్లో ఒకడు " అని హురేస్ అన్న మాటలూ వేమనకు చెందుతాయి. విశృంఖలమైన ఆయన మేధస్సు, ఆవేశపూరిత స్వభావం, స్వవచో వ్యాఘాతం చూస్తే వాల్ట్ విట్మన్ తన్ను గురించితాను చెప్పినమాటలు "నావచనాలకే నేను వ్యాఘాతం కల్గిస్తున్నానా ? అలా అయితే మంచిదే నన్ను నేను వ్యతిరేకిస్తున్నాను. నేను విస్తారమైన వాణ్ణి నాలో సమస్తమూ యిమిడి వున్నాయి "జ్ఞాపకం వచ్చి సాల్యూట్ చేయబుద్ధేస్తుంది. బెర్నార్డ్‌షాకున్న చమత్కారం చాపల్యం, స్పష్టతా, టాల్ స్థాయికి వున్న సార్వకారిక నైతిక అభినివేశం వేమనలో వున్నాయి. వేమన అసలైన చిత్రం వేయాలంటే ఆకళ్ళలోని కాంతిని, పెదవులపై వక్రదరహాసాన్ని, నడకలో చురుకుదనాన్ని ప్రతిబింబింప జేయగల్గిన రఫేల్ రెంబ్రాండెంట్ వంటి చిత్రకారులకే సాధ్యం అని నార్ల నానావిధాన వేమన స్తుతి చేశారు.

## ఆంధ్ర మత కర్తలు లేరా ? (ఛందో వైవిధ్యం )

"ఆంధ్రుల్లో మత ప్రచారకులున్నారు కాని మత కర్తలు లేరు. ' నాకు యియ్యలేదని తిట్టిన వారేకాని నువ్వు చెడిపోతున్నావు ' అని చెప్పినవారు లేరు. మత త్రయ కర్త లెవ్వరూ ఆంధ్రులుకారు. తనకు తోచిన తత్వాన్ని నిర్భయంగా ప్రజలకు బోధించటానికి ఆంధ్ర దేశమంతా తిరిగి, మఠాలు స్థాపించి బోధ చేసినవాడు తెలుగు వారిలో వేమనే మొదటివాడు. పుస్తకాలలోని విషయాలు చెప్పకుండ, యోగసాధనతో తత్వాన్ని గ్రహించి దాన్ని తాననుభవించి, తన దేశం వారిని తరింప చేయాలన్న ఉదారాశయంతో ఉపన్యాసాలిచ్చాడు. అతని బోధనల్లో జీవం వుంది. మత కర్తలు కాని మత ప్రచారకులలో, మత కర్తలకున్నంత విలువను, వ్యాప్తిని కొంత వరకు సంపాదించిన ధీరుడు వేమనే. వేమన పద్యాలు చిటికెలో ముగింపగల చిన్న పలుకులు. అచ్చ తెనుగు పద్యం నడక, గుండు దెబ్బలాగ గురి తప్పని చిక్కని చెక్కిన మాటలు. వేమనను పరిచయం చేసిన బ్రౌను వేమనను " కవి అనలేదు ". "వ్రాలకందని పద్యముల్ వేలసంఖ్య "గా చెప్పాడు. ఆటవెలదే కాక, "భువిరాజతారకంబులు / ప్రవిమలతర హంసయోగ భావంబులకున్ / వివరంబులుగావించెద "/ వంటి కంద పద్యాలు చెప్పాడు. "శ్రీకరుడగు వేమన చెప్పినట్టి " వంటి తేటగీతులూ చెప్పాడు. కొన్ని పాటలూ చెప్పాడు. "వేమన వాక్యాలు" పేర పద్యాల వంటి వచనాలు చెప్పాడు. వీటి చివరా విశ్వదాభిరామ మకుటంవుంది. ఇవి యోగ, సాంఖ్య తత్వాలు " అని రాళ్ళపల్లి వారు సమగ్రంగా శోధించి చెప్పారు. మచ్చుకు ఒక వేమన వాక్యం చూద్దాం. " పూర్ణ సమాధిలో రేచించి, పూరించి, కుంభించి, పెద్దగాలివలెనే బరుగుచుండు - యేడు కోట్ల వెర్రినాదంబులు గానబడును. మేను చల్లని గాలివలె విసరును - గాలిలోపలనుండును. గంధర్వగానంబు గానబడు





వినుబాటలో నుండు ఎంతైన నడు వీధినాడు చుండు " - అలాగే "ఆది మూలమందు అంబికా శివయోగి మూలగురుడు మాకు ముక్తిజూపె బహశ : లంబికా శివయోగిని అంబికా శివయోగి అన్నాడు.

## దుహ్మదీయులపై వేమన అభిప్రాయాలు

మహమ్మదీయులుపరిపాలించే రోజుల్లో హిందువులను భవించిన కష్టాలను స్వయంగా చూసి స్పందించాడు వేమన. " పసరపు మాంసము బెట్టియు / మసకల సులతాను ముసలి మానుల జేసెన్ / అని మతం మార్పిడిని ముసల్మాను లెలాబలవంతంగా చేయించారో చెప్పాడు. "లింగమతములోన దొంగలుగా బుట్టి / యొకరినొకరు నిందనొరగజేసి / తురక జాతి చేత ధూళియై పోదురు "/ అని మనమతంలోనే దొంగలుండి, ఒకరి నొకరు నిందించుకుంటూ వుంటే, చివరికి తురకజాతి అందర్నీ కబళించి మట్టిపాలు చేస్తుందని హెచ్చరించాడు. "షేకునైదు మొగలు, చెలగుపఠానులు / తురకల దొరతనము తొలుత జేసి / రాగరాగ విడిచి రైతులై కొలిచిరి " / అని మహమ్మదీయుల క్రమ పతనాన్ని వివరించాడు. వైభవం కోల్పోవటాన్ని విప్పి చెప్పాడు. మనకున్న మూఢ విశ్వాసాలు వాళ్ళకూ వున్నాయని ఎద్దేవా చేస్తూ " మక్కకు జననేల, మగుడ దారానేల / యేకమైన చిత్తమెందు గలదు / అన్నిట పరిపూర్ణ మల్లా మహమ్మదు " అని వాళ్ళకూ హితమైన మతబోధ చేశాడు. అసలు విషయం, ఎక్కడో యేదో వుందని వెంపర్లాడ వద్దని భావం.

## శివయోగి తత్వమేమిటి ?

శంకరా ద్వైతానికి, శ్రీవైష్ణవా ద్వైతానికి మధ్యలో వున్న వారిని వీరశైవులు అంటారు. శివతత్వంలో శక్తి లింగం అని, అంగం అని రెండు. లింగాన్ని

పూజిస్తారు – రుద్రరూపం. అంగం జీవాత్మ. శక్తికూడ 'కళ' అని 'భక్తి ' అని రెండు రకాలు. శివునిలో కళ వుంటుంది. సంసారానికి, సృష్టికి కారణమవుతుంది. భక్తి జీవునిలో వుండి ముక్తికి కారణ మవుతుంది. భక్తి నిరంతరంగా వుండి, జీవుడికి శివునితో ఆనందంతో కూడిన ఐక్యం లభిస్తుంది. ఇదే ముక్తి. దీనికి యోగసాధన కావాలి. ఈ రకమైన అద్వైతాన్ని అభ్యాసం చేసే వారంతా శివయోగులు. వేమనను శివయోగిగా భావిస్తారు. దీనినవలంబించే వారంతా అబ్రాహ్మణులే. వీళ్ళల్లో కొంతమంది గృహస్థులు, కొందరు మఠనివాసులు. ఎక్కువమంది బ్రహ్మచారులు. వీళ్ళంతా స్వర్ణకార విద్యలో నేర్పరులే. అందుకే వేమన కూడ "ఇహమున సుఖియింప హేమ తారక విద్య / పరమున సుఖియింప బ్రహ్మ విద్య / కడమ విద్యలెల్ల మూఢుల విద్య " అని తేల్చిచెప్పాడు.

## హఠయోగం

ధ్యానం, తపస్సు, యోగం సాధనలో కైవల్యం సాధించాలంటే చాలాకాలం పడుతుంది. వస్తుందో రాదో అనుమానం. తక్షణ ప్రయోజనం కలగాలని సాధకులకు సహజంగా వుంటుంది. దానికోసం అవసరమైతే దేహాన్ని చాలా కష్ట పెట్టుకొని, మనస్సును బాధించి లొంగ దీసుకునే ప్రయత్నం చేస్తారు. 'హ' అంటే పైకి నడిచే ప్రాణవాయువని, 'ఠ' అంటే క్రిందికి నడిచే అపాన వాయువని అర్థం చెప్తారు. ఈ రెండిటి ఐక్యం చేసి సాధించేది ' హఠయోగం ' కనుక వీళ్ళకు ఆసనం, ప్రాణాయామం చాలా ముఖ్యం. శరీరంలో వున్న మలినాలు శుభ్రం చేసుకోవటానికి అంటే శ్వాసకోశం, పొట్ట, ముక్కురంధ్రాలు మొదలైన వాటిలో వుండే కఫం శ్లేష్మం వగైరాలను బయటకు తీసి శుభ్రం చేసుకోవటానికి "ధౌతి ", నౌళి" అనే ప్రక్రియలు చేస్తారు. బ్రహ్మచర్యం నిలకడగా





స్థిరంగా వుండటానికి " వజ్రోళి " యోగం చేస్తారు. మూలా ధారంలో కుండలిని నిద్రించి వుంటుంది. ఈ యోగ సాధనలో పైకి లేవటం ప్రారంభిస్తుంది. కుడి, యెడమ ముక్కుల్లోని ఇడ, పింగళనాడుల్లో సహజంగా సంచరించే వాయువు, ఈరెంటి మధ్య వున్న 'సుషుమ్న ' నాడి ద్వారా ప్రవహిస్తుంది. ఆరు చక్రాలలో క్రమంగా ప్రయాణం చేసి సహ స్రారం చేరినపుడు అక్కడ బ్రహ్మ సాక్షాత్కారం పొందడంవల్ల "అసం ప్రజ్ఞాత సమాధి " కల్గుతుంది. అదే జీవన్ముక్తి. కుండలిని కదిలించకపోతే బ్రహ్మస్థానం లభించదు. దీనినే "రాజయోగం " అని కూడా అంటారు. ప్రాణవాయువు లోపల వుంటే బతుకు. బయటకు పోతే చావు. అందుకనే హఠయోగం " యావద్బద్ధో మరుద్దేహే యావచ్చిత్తం నిరాకులం / యావద్దృష్టిర్భ్రువోర్మధ్యే తావత్కాల భయం కుత : ? అంటుంది. శివయోగ తత్వంలో " కట్టిపడి యుండు నెందాక గాలిమేన / చిత్తమెందాక నెందును జెందకుండు / కదల దందాక భ్రూమధ్య కవిత దృష్టి / యరయనందాక ప్రాణ భయంబులేదు " అని వివరించింది. హఠయోగానికి మంత్రయోగం, లయయోగం అనే రెండు ఉపయోగాలున్నాయి. మంత్రానను జపిస్తూ తన్మయుడవటం మొదటిది. ప్రాణాయామ ధ్యానాలతో దేహం పరిశుద్ధమైనపుడు లోపల ఒక విధమైన 'నాదం' అఖండంగా విన్పిస్తుందట. బయటి శబ్ధం ఆహతం – అంటే దెబ్బకొట్టే కలిగిన శబ్దం. లోపలిది అనాహతం. అంటే ఏ పదార్థాల స్పర్శలేకుండా విన్పించేది. ఆనాదం వింటూ మనస్సును, ప్రాణాన్ని లయింప చేయటమే 'లయయోగం '. చాలా లయలున్నాయి. కాని నాద లయ చాలా ముఖ్యమైనదని హఠయోగ ప్రవక్త "శ్రీ ఆదినాధుడు " చెప్పాడు. వేమన గురువు ' లంబికా శివయోగి ' హఠయోగి.

# "లంబికాయోగం"

లంబిక అంటె దవడ. దానిపై గల శిరోరంధ్రంలో నాలుక ప్రవేశ పెట్టాలి. భ్రూమద్యం ఎడమ వైపు 'చంద్రస్థానం' నాలుక చంద్రస్థానాన్ని అంటాలి. అప్పుడు అగ్ని పుట్టుంది. ఆ స్థితిలో చంద్రస్థానం లో అమృతం కరిగి స్రవిస్తుంది. దాన్ని తాగితే యోగికి రోగం, ఆకలి, దప్పిక వుండవు. చావురాదు. దీన్ని సాధించాలంటే చాలా కష్టం. నాలుక అంత పొడవు సాగటం అసాధారణం. అసాధ్యం మాత్రం కాదు. అందు కోసం నాలుక క్రిందవున్న నరాల్ని క్రమంగా కోసి, వ్రేళ్ళతో యిటు అటు నాలుక తిరిగేట్లు చేస్తారు. ఆ తర్వాత లంబికా రంధ్రంలోకి దూరేట్లు సాగదీస్తారు. ఇదే లంబికాయోగం లేక ఖేచరి ముద్ర. కళ్ళుముసి దృష్టిని నాశికాగ్రంపై చేరిస్తే, మండలాకారంగా, జ్యోతి దర్శనమిస్తుంది. అందులో మనస్సు, ప్రాణం లీనం చేసి, రెప్పలు కదల్చకుండా చూసేవాడు "జగద్గురువు"-ఇదే నిజమైన 'ఖేచరి విద్య" అని శివయోగసారం వివరిస్తోంది. వేమన కూ ఈవిద్యపై నమ్మకం వుంది. తన గురువు లంబికాశివయోగి దీన్ని సాధించాడుకదా అందుకే " ఖేచరీ ముద్రకు కీలెరుంగలేక / వాదులాడు నట్టి వారినేల్ల / త్రొక్కినాల్క బట్టి తుద గోయవలయురా "/ అని తన నమ్మకాన్ని చెబుతూ, వాదించేవాళ్ళకు వాతలు పెట్టాడు. తానూ సాధించి అనుభవం పొందాడు వేమన. "నాదమలర జేసి నాదంబు జొంగించి / ఖేదమింత లేక పెనిగి నవుడు / పారు కాల్వ వలెను పారురా యీనాడు." అన్నాడు. "కనుల చూపు నిలిపి కాంతిని గమనించి / కాచవలెను చిత్రకళల దాటి " అని రహస్యం వివరించాడు. రాజ యోగం ద్వారా అద్వైతాను భవం పొందిన వేమన ఆసనాలు, ప్రాణాయామం వగైరా హఠవిద్యల్ని తిరస్కరించినట్లు " ఆసనంములు పన్ని అంగంబు బిగియించి / యొడలు విరుచుకొనెదు యాగ మెల్ల / జెట్టి సాముకన్న చింతాకు తక్కువ " అన్న పద్యం ద్వారా తెలుస్తోంది.





# వేధదీక్ష

మంచి గురువు తన శక్తి సామర్థ్యాలతో హఠయోగ సాధన చేసే శిష్యుని కష్టాన్ని చూసి దయతో స్వశక్తితో ఒక్కనిముషంలో అసంప్రజ్ఞత సమాధి కల్గించి బ్రహ్మ సాక్షాత్కారం చేయించగలడని "సద్గురు నాధప్రసాదంబున క్షణమున రాజయోగమున మనసు నాశనమూతోడనే, నాశమూ గాలియు " అని శివ తత్వ సారం చెబుతోంది. దీననే తాంత్రికులు "వేధదీక్ష " అంటారు. శిష్యుని దేహంలోవున్న షట్చక్రాలను గమనించి, మంత్రబీజాక్షరన్యాసం చేసి, మోకాళ్ళు మెదలు నాభి, హృదయం, కంఠం, దవడ వరకు గురువు 'వేధిస్తాడది. వెంటనే శిష్యుడి పాపాలన్ని నశించి, బయట వ్యాపారాలన్ని నిలిచిపోతాయట. ఇంత బాధపడటం వేమనకూ యిష్టంలేదు. ఎవరికి వారు స్వయంగా సాధించాలనే కోరాడు. అందుకే "వెర్రిగాను జూడ వెలుగెల్ల బారురా" అన్నాడు. దీనికి ఆధారంగా " బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి / విష్ణు జంపి శివుని వీరు గలిపి / శివుని జంపి తాను శివయోగి గావలె " అని ,త్రిమూర్తులకు అతీతమైన బ్రహ్మ జ్ఞానం పొందాలని చెప్పాడు. ఇవన్ని తాను సాధించానని తెలియజేయటానికి " బ్రహ్మ వ్రాత కెదురు పల్కిన వాడును / ఆది విష్ణు సూత్రమడచువాడు / మూడు కనులవాని మొనసి నిల్పినవాడు / కానబడరు నీవుకాని వేమ/ అంటూ తన సామర్థ్యాన్ని ఎరిగించాడు.

# తాంత్రికులు

తంత్రం అంటే పరబ్రహ్మ సాక్షాత్కారం కోసం చేసే సాధన. మంత్రం, బీజాక్షరాలు, యంత్రాలు, ముద్రలు, పూజలు షట్చక్ర ఛేధనం, కుండలిని యోగం యివన్నీ కలిస్తే తంత్రం. ఇవన్నీ బహిరంగంగా చేస్తారు తంత్ర

సాధనలో.కొంతమంది. మద్యం, మాంస మొదలైన పంచమకారాలకు ప్రాధాన్యతనిచ్చి,రహస్యంగా సాధన చేసే వారిని ''తాంత్రికులు'' అంటున్నారు.వీళ్ళూ అద్వైతులే. శక్తిని ముందు పూజిస్తారు కనుక "శక్తేయులు" అని అంటారు. స్మశానంలో పూజ చేసే యిలాంటి వారిని "వామాచారులు" అంటారు.వీరికి "కులార్ణవితంత్రం " 'మహానిర్వాణతంత్రం' అనే రెండు గ్రంథాలు పూజనీయాలు. దాని తత్వాన్ని ఆచరిస్తారు. వేమన "వేదవిద్య లెల్ల వేశ్యల వంటివి / భ్రమలబెట్టి తేది పడగనీవు/గుప్త విద్య యొకటి కుల కాంత వంటిది " అన్నాడు.ఆయన తాంత్రికుడనీ,కాదని చెప్పివారున్నారు.

## " వేమన భావ తీవ్రత "

విద్వాంసులను లక్ష్యం చేయకుండా తన భావాలను తేలిక పదాలతో జన హృదయాలకు హత్తుకునేట్లు చెప్పాడు వేమన.ఎవరేమనుకుంటారన్న భయంలేనివాడు.ఒకరి మెచ్చు కోరని అచ్చపుకవి. అందుకే "ఆదిమ కవులవలే అల్పుండు తానెరింగి /చెప్పలేడు,తప్పు బట్టు / త్రోయనేర్చుకుక్క దొంతులు బెట్టునా? /" అని ఎద్దేవా చేస్తాడు.తను చెప్పిన మాటల్ని ఎప్పటికైనా పండితులు అర్ధం చేసువుంటారని,వాళ్ళ పద్ధతి మార్చుకుంటారని ఆయనకు తెలుసు ." వేముడిట్లు చెప్పు వివరపు వాక్యముల్ / వేముడిట్లు పోవు వెర్రి పోక / పామరులకు నెల్ల ప్రతి పక్షమైయుండు / పండితులకు నెల్ల పరము వేమ/" అని వాళ్ళు తన దారికి రావాల్సిందే,కాలం వాళ్ళను దారికి తెస్తుందన్నట్లు చెప్పాడు. ఇంతకీ వేమన పద్యాలకు కవితా గుణం ఏమిటి? అని ఆలోచించారు పెద్దలు. " ఒక వస్తువు గురించి తనకున్న భావాల్ని భాషతో యితరుల మనసుకు పట్టేటట్లు తెలియజేయటమే కవిత్వం " అన్నారు రాళ్ళపల్లి వారు. ఈ కోణంలో ఆలోచించారు. కవిత్వంలో ముఖ్య జీవ ధర్మం "ఇతరుల మనస్సుకెక్కటం"–





కవి, భాష, వినేవాడు ఒక సహృదయ చక్రం. కవి తన భావాలకు తగ్గ భాష యెన్నుకుంటాడు. ఆ భావం సంగ్రహంగా , స్పష్టంగా, సరళంగా వుండాలి,చెప్పాలి. వినేవాడికి సహృదయగుణం వుండాలి. ఏ భావాన్నైనా పూర్తిగా అనుభవించే సహజ సహృదయత్వం వున్నవారిని సహృదయులంటారు. వారే తమ హృదయాల్ని మరచి కవి హృదయంతో చూడగలరు. అంటే అహంకారం పనికిరాదు – అహంకారం అంటే నా సిద్ధాంతం, నేను , నాది అనే భావం. కనుక కవితో యేకీభవించి వింటే అనిర్వచనీయమైన ఆనందం కల్గుతుంది. ఆది ప్రత్యక్ష సిద్ధం. ఇలాగ మమతను పరిత్యాగం చేసిన సాయుజ్యమే మోక్షానందానికి కారణం. అని అనంత కృష్ణ శర్మ గారి అతి సామాన్య భాష్యం – అప్పుడే వేమన మనకు అర్ధమవుతాడు, ఆరాధనీయుడౌతాడు. ఇలాంటి సాయుజ్యానికి ఛందస్సు బాగా సహకరిస్తుంది. ఛందస్సుకు లయ ప్రధానం.లయ అంటే క్లుప్తంగా వున్న వివిధ శబ్దాల నడక. దీనికి మండించే గుణం వుంది. లయకు తీవ్రభావం, వెలువరించే భాషతోడై తే త్రివేణీ సంగమమే. వేమన కవిత్వంలో చాలా ముఖ్యమైంది భావ తీవ్రత.దీనికి కారణం భావాలన్ని ఆయన స్వంతాలు కావటం, భావాలు స్వంతం, సహజం అవటం వల్ల భాషకు బిగువు, బలం వస్తాయి."భావం నీళ్ళు నిండిన పాత్ర భాష దాన్ని పైకి లాగే తాడు" అన్నారు శర్మ గారు. వేమన కవిత్వంలో భావం,భాష జమిలిగా పెనవేసుకు పోయాయి. వేమన కవిత్వంలో అర్ధంకాని యింకో విషయం 'ఆటవెలది' ఛందస్సు. "ఇంత చిన్న వృత్తంలో, అంత గొప్ప భావాలను,యతి స్ధానాలు వదలకుండా, వెనక ముందు అతుకులు,తిరుగుడులు లేకుండా, కత్తిరించినట్లున్న శబ్ధాలతో ఎలా అచ్చుగుద్దినాడు? " అని ఆశ్యర్యం కల్గిస్తుందని రాళ్ళపల్లి వారు వితర్కించారు. తెలుగు ఛందస్సులో 'ఆటవెలది' చిన్నది. మిగిలిన ఛందాల్లో రాసినా "ఈ ముద్దు ఈ చెక్కిన చక్కదనం, ఈ బిగువు,ఈ లగువు లేదు".అని మురిసిపోయారు. 'యతి' స్ధానానికి ఒక 'యతి' కిచ్చిన గౌరవం మర్యాద

యిచ్చాడు. తక్కిన యతి విషయంలో యతి కనుక్కోవటం కష్టం.వేమన్న యతి విషయంలో పట్టుబట్టాడు.ఎక్కడ వుండాలో అక్కడే వుంచాడు. అభిప్రాయం కూడ అక్కడ ఆగి నిలుస్తుంది.ఇంతకీ యతి అంటే ? లయాను సారంగా పాద మధ్యంలో ఒక చోట పదాన్ని వుంచటం యతి.

హస్యం,వ్యంగ్యం మేళవించటంతో కవిత్వం హృదయ రంజకం అయింది."పాలసాగరమున పవ్వళించిన వాడు / గొల్ల యిండ్ల పాలుకోర నేల? / అని ప్రశ్నిస్తూ " ఎదుటివారు సొమ్ము వారి తీపి అని ఆ దేవదేవుణ్ణి వాయించేశాడు. కృష్ణుడిని ఏదో అన్నాడని ఎవరికీ కోపం రాదు – దాన్ని అద్భుతంగా సమర్ధించాడు అని ఆనందం,నవ్వు వస్తాయి.అదే వేమన ప్రత్యేకత.అలాంటిదే యింకోపద్యం – " గుహలలోన జొచ్చి గురువుల వెదకంగ / క్రూరమృగమొకండు తారసిలన/ ముక్తి మార్గమనియె ముందుగా జూపురా / – ముసిముసినవ్వుల జల్లులు కురవాల్సిందే.వేమనకు సంగీతరాగాలలో తోడిరాగం బేల ?" అని దాని స్వారస్యం తెలియని వార్ని గురించి చెప్పాడు –వేమన గురువు శివ యోగి స్వర్ణకార వృత్తివాడని అందరు భావిస్తారు.వీళ్ళకు "పశ్యతోహరులు" అని పేరు – అంటే చూస్తుండగానే బంగారాన్ని హరిస్తారని భావం.వారిని కూడా వేమన "కంసలికి మించు కడలజాతి లేదయా" అని తీక్షణంగానే దూషిచాడు.ఆ జాతి అంతా అని భావం కాదు.ఆయనకేదురైనవాడెవ్వడో మోసకారి అయివుంటాడు.వాడి మూలంగా కులమంతా నింద పొందాల్సివచ్చింది. అంతటి భవ తీవ్రత వేమనది. అందులో మంచి వారినీ మెచ్చారు "మెదట బ్రహ్మ,మనువు,మొనయ రెండు యముడు / మూడు త్వ ష్టశిల్పి మెనయ నాల్గు / విశ్వ కర్మనెగడె విశ్వజ్ఞుడైదింట" అని విశ్వానికే బ్రహ్మలుగా కీర్తించాడు.





# యుగవేది వేమన

వంద బ్రహ్మ ప్రణయాలు ఒక విష్ణువురోజు అని,వంద విష్ణు ప్రణయాలు ఒక రుద్ర దినం అని,చెప్పే యుగ పరిజ్ఞానం గల యుగవేది వేమన ."మేకలు మూకలు సనినను / బ్రాకటముగనొక్క కోతొ పర్ణం బెక్కెన్ / ఆ కపులు నూరుచనినిను / కోకోయని కొంకనక్క కూయుర వేమా " / అని గుప్తంగా చెప్పాడు. మేకను అజం అంటారు అంటే బ్రహ్మ. కోతిని అరి అంటే విష్ణువు,కొంకనక్క అంటే శివం అంటే శివుడు.

# గణిత జ్ఞాని

"ఒకటి క్రింద నొక్కటొనరు లబ్దము వెట్టి /వలనుగా గుణింప వరుస చెరుగు / నట్టిరీతినుండు నౌదార్య ఫలములు " – వింటే ఫలితాలు "జామెట్రిక్ ప్రొగ్రెషన్ " లో వుంటాయన్నట్లుగా చెప్పాడన్నమాట.

# రైతు పక్షపాతి

దేశానికి వెన్నె ముక గా రైతును భావిస్తాం.రైతు 'అన్నదాత' అంటాం.రైతురాజ్యం కావాలని కోరుతాం. రైతుకష్టాలు తీర్చం ఈ విషయాలన్నీ వేమనకు తెలుసు – వారి కష్ట సుఖాలు కళ్ళతో చూసి సానుభూతి ప్రకటించాడు. "పైరునిడిన వాని ఫలమే సఫలమగు / పైరు నిడనివాడు ఫలము గనునె ? / పైరు పెట్టి భూమి ప్రజల బోషించురా /" అని రైతు త్యాగాన్ని ప్రశంసించాడు.

# దాతృత్వం

సాధారణంగా దానం యిచ్చేవాడికి అడిగేవాడు లోకువ.కాని మహాత్ములు దానంను స్వతస్సిద్ధ గుణంగా భావిస్తారు.బలి చక్రవర్తి వామనుడికి భూ దానం చేస్తుంటే అడ్డ పడిన గురువు శుక్రాచార్యునితో " మీదైనాకరంబుంట మేల్ గాదే " అని దాన గర్వం చూపాడని మనకు తెలిసిందే.అరుదుగా అడిగితే

అర్థి కాదట.తరచుగా యివ్వకపోతే దాత కాదట – ఈ విషయాన్ని పద్యంలో చెప్పి " దాతకర్థి కంత తార తమ్యము సుమీ "/ అని తేల్చాడు. "అడుగ కర్థ మిచ్చునతడు బ్రహ్మజ్ఞాని / అడుగ నర్థ మిచ్చునతడు త్యాగి / అడుగ నియ్యలేని యాతడె పెనులోభి ' / అని తారతమ్యాలను త్రాసులో తూచినట్లు చెప్పాడు. అడగటంలోనూ నీతి వుందని చెప్తు "అడుగదగు వారినడుగుట / నిడినయెడం గొసరకుంట, నీలేననగా / గడుపై వేడక యుండుట / యడిగెడి వారలకు నీతి యగురా వేమా ! " అని కందంలో అందంగా అడుక్కునే నీతి సూత్రం చెప్పాడు. ఇది గొప్ప సూక్తి ముక్తావళీ.

## "వైద్య వేది "

చిన్న చిన్న రోగాలకు, వ్యాధులకు చిట్కా వైద్యం చెప్పాడు వేమన. ఆచరణ సాధ్యమైనవే. డబ్బు ఖర్చు కానివే. " కుక్క కరిస్తే అరవకుండా దాని నోరు కట్టేసి, ప్రక్కలు విరిగేటట్లు దాన్ని కొట్టి, "వేము చెక్కదిన్న విషరోగములు వాయు / దేహ కాంతి గలుగు దృఢముగలుగు / తినతినగననియె తీయగా నుండును " అని 'వాము' మహాత్యం చెప్పాడు వేమన. తినగాతినగా చేదూ తియ్యగానే వుంటుంది – వినగావినగా వేమన వాక్యాలు తీయగా వుంటాయి. వ్యాధి వస్తే వైద్యం చేయించుకోవాలి. మందు వేసుకోవాలి. కానీ దీనికంటె ముఖ్యం " మందు వంటి మనసు మనుజుండుగావలె " అని హితవు చెప్పాడు. మందు తాగితే రోగం ఎలా పోతుందో, అంతటి ప్రభావం మనసుకూ వుంది – దాన్ని జాగ్రత్తగా వాడాలి. "కాంత సింధురమ్ము కడుపిత్త వ్యాధికి / నొసగు తేనెతోను నొసరనిడిన /దనరు దేహ బలిమి ధన్యుడై యుండురా " / అన్న పద్యం వల్ల వస్తు గుణ దీపిక తెలిసినవాడిగా వేమన్నను భావిస్తారు. పిండోత్పత్తి గూర్చి క్షుణ్ణంగా తెలుసాయనకు. ఆత్మను దర్శించిన యోగికి తెలియనిదేముంటుంది ?





## వింతలు, విశేషాలలో వేమన

పొరపాటైనా వేమన ఓసారి తత్వవేత్త "ప్లేటో " సరసన చేరాడు. ఎలాగంటే / సర్ విలియం జోన్స్ అనే రచయిత 'భారతదేశపు ప్లేటో " గా వేమనను గురించి చెప్పాడని మా కొనాల్డ్ వ్రాశారట. తీరా ఆరా తీస్తే, ఆయన చెప్పింది వేదవ్యాసుని గురించి కాని వేమన గురించి కాదు అని తెలిసింది. 'ప్రజల్లో పట్టంలేని ప్రభువు వేమన ' అన్నారు. 'వేమన యోగీంద్ర చరితం ' వ్రాసిన మచిలీపట్నానికి చెందిన పూర్ణయాచార్యులు దేశం అంతాతిరిగి వేమన కవితల తాళపత్రగ్రంథాలు సేకరించాడు. 1913లో వేమన పద్య సంకలనం ప్రచురించాడు. ఆయన దృష్టిలో వేమన "ఒక పురుష వృషభుడు " . సర్ రఘుపతి వెంకట రత్నంనాయుడు గారికి వేమన్నంటే వెర్రి అభిమానం. "నీవు చావటానికే పుట్టలేదు " అన్నీ ఆంగ్ల కవి కీట్స్ వాక్యమూ, "అతడు మానవుడు, అన్నివిధాల మానవునిగనే స్వీకరించండి, అతని వంటివాడిని మరలా నేను దర్శించబోను " అన్ని మహాకవి షేక్స్‌పియర్ మాటలూ, "తళుక్కున తట్టిన తలపును చటుక్కున చెప్పాడు కవి " అనిన ఎమర్సన్ భావము, "సహజ హాస్య చతురుడైన గ్రామీణుడు ప్రకృతి దార్శనికుల్లో ఒకడు " అని భావించిన "హురేస్ " అభిప్రాయమూ వేమన గారికి చక్కగా వర్తిస్తాయని విశ్లేషణాత్మకంగా నార్ల రాశారు. కారణ విమర్శ శక్తికి పట్టాభిషేకం చేసిన మహాత్ముడు వేమన.

"ఈత కన్న లోతు నెంచంగబని లేదు / చావు కన్నగీడు జగతిలేదు / గోచిపాతకంటె గొంచెంబికను లేదు ". అన్న పద్యానికి ఎ.ఎల్.ఎన్. మూర్తి ఆంగ్లాను వాదం అద్భుతంగా చేశారు.

# తోపాగారి భావధార
# "మానవీకరణ మార్గం "

డాక్టర్. ఈశ్వరతోపాగారు ఆంగ్లంలో "సెయింట్ వేమన అండ్ హిజ్ ఫిలాసఫి " అన్న గ్రంథాన్ని రచించారు. దానిని డా ॥ దివాకర్ల వెంకటావధాని గారు సరళంగా తెలుగు చేశారు. దీనిలో వేమనపై తోపాగారు ప్రవహింపజేసిన భావధారను పరిశీలిద్దాం.

సంఘంలో మానవుడు యింకా సంస్కారికాలేదు. మానవత్వ విషయంలో చాలావరకు వెనక బడి వున్నాడు మానవుడు. అతనికి మార్గదర్శకాలై, అభ్యుదయానికి వుపయోగపడే సహజ సరళమార్గాన్ని వేమన చెప్పాడు. ఉన్నత వర్గాలలో సంస్కృతి మృగ్యంగా వున్నట్లు వేమన గ్రహించాడు. మానవ జీవితం జీవశాస్త్ర సిద్ధాంతాలకు అనుగుణంగా వర్తిస్తుంది. అందుకే వేమన "దేహము బడలిక బడినను / పోషణ తత్వములు పొందవు " / అన్నాడు. వ్యాకులత వుంటే భావచాంచల్యం కలుగుతుంది. మనస్సు మాత్రమే ఆలోచనలను సంబద్ధంగా, అర్థవంతం చేస్తుంది. బ్రతికినప్పుడే ఆలోచనలు మనిషికి తోడ్పడాలని వేమన భావం. "తనువు తీరెనేని తలపు తోడనె తీరు " అని హెచ్చరించాడు. ఆత్మను సంస్కరించుకోవాలి. ఆ సంస్కారమే మనిషికి, పశువుకి తేడా తెలుపుతుంది. మనిషిగా తన పని చేసుకుంటూ, ఆత్మ విజ్ఞానంలో బుద్ధిగా జీవించాలి. తన హద్దులు తెలిస్తే గర్వం రాదు. అందుకే "జనన మరణములకు సరిస్వతంత్రుడు గాడు /మొదల కర్తగాడు తుదనుగాడు / నడుమ కర్త ననుట నగుబాటు కాదోకో " / అని జన్మ రహస్యం చెప్పాడు. ఈ జీవిత తత్వం తెలుసుకోకుండా దానిలో మునిగి పోవటం మూఢత్వం. మన చుట్టూ మంచి, చెడూ రెండూ వుంటాయి. వివేకంలో సంచరించాలి. ప్రలోభపడరాదు. అంత





:సంస్కారం లేకపోతే జీవితం అర్థం కాదు. జీవితంలోని రహస్యాలను అర్థం చేసుకోవాలి. హీనమైన సంస్కృతి నుంచి ఉత్తమ సంస్కృతికి మానవుడు చేరాలి. మనుష్యుల స్థితి ఎలా వుందో యిలా చెప్పాడు – " కవియుగాన లేదు, కదలింపడా నోరు / వినియు వినగ లేదు విస్మయమున / సంపదగలవాడు సన్ని పాతకమది " అని మనుష్య స్వభావం చెప్పాడు. జీవితం తమనుండి యేమి కోరుతోంది మనిషి తెలుసుకోలేక పోతున్నాడు. మానవ ప్రవృత్తి అవగాహన మొదటగా నేర్వాలి. అప్పుడే అతనికి అన్నీ దక్కుతాయి. " వ్రాత వెంట గాని, వరమీదు దైవంబు / సేత కొలదిగా వ్రాత గాదు / వ్రాతకజుడు కర్త సేతకు దా కర్త "/ అని అతడు చేసే పని మీదే అంతా ఆధారపడి వుందని తేల్చాడు.

భోగ పరాయణత్వం జీవితాన్ని దెబ్బతీస్తుంది. మనశ్శాంతి వుండదు. కృతజ్ఞతరాదు. "పర సుఖంబు నొంది, బ్రతుకంగ నేరదు " అనాడందుకే. "నేరనన్నవాడు నెరజాణ మహిలోన / నేర్తునన్నవాడు వార్తకాడు / ఊరకున్న వాడె యుత్త మోత్తముడెందు " అందుకే తన్నుతాను తెలుసుకోవాలి. తనకు చెప్పగల వారెవరు ? " తనుదా దెలియక యుండిన / తనకెవరున్ దెలుపలేరు తథ్యమువేమా ! " సంస్కారం రావాలంటే సత్య సంధత కావాలి. లోకంలో అసత్యం ఆధిపత్యం వహించటం వల్ల అంతరాత్మ నిర్జీవమై, సత్యభాషి ద్వేషానికి గురౌతున్నాడు. నిజాన్ని నీచునితో చెప్పరాడు. "నిజ మహాత్మ్మ గూడి నిజమాడవలెనురా ! అన్నీ మంచి నిజం చెప్పాడు వేమన. వేమన చెప్పే సాంస్కృతీకరణం చేస్తే మనుష్యుడిల మహానుభావుడే – "జాతి వేరు లేక జన్మక్రమంబున / నెమ్మదిన భవుని నిల్పెనేని / యఖిల జనులకెల్ల నాతడె ఘనుడయా " /.

మనిషిని అర్థం చేసుకోవటం, స్నేహం చేయటం వల్ల బంధం గాఢం అవుతుంది. మత సిద్ధాంతాలు మానవత్వంలో వుండాలి. అప్పుడే సామరస్యం

వస్తుంది. మతం మానవుణ్ణి సృష్టికర్తకు దగ్గర చేర్చేదే కాక, మానవులందర్ని ఐక్యం చేసేది. సత్యమైన మతం యిదే బోధిస్తుంది. మానవత కోసం మతం అవసరం. అందుకే వేమన "ఎలి, రేపు నేడదేలాగునైనను / మనసు నిలుపువాడు మంచివాడు " / అన్నాడు.

ఇంద్రియాలను వశపరచుకోవాలి. లేకపోతే సంస్కారం రాదు. "కడుపు చిచ్చుచేత కామానలము చేత / క్రోధ వహ్ని చేత కుటిల పడల / నొక్క మనసుతోడ నుండినప్పుడె ముక్తి " /. ఇంద్రియాలను జయించాలి అందుకే " మచ్చరమే తన్ను జెరచు మహిలో వేమా " / అని హెచ్చరిస్తాడు.

సంపూర్ణ మానవుడిని ఆవిష్కరించాలి అని వేమన గాఢంగా భావించాడు. సమగ్ర మానవత్వం రావాలంటే తనకు, ప్రపంచానికి వున్న క్లిష్ట సంబంధాన్ని తప్పించుకొనే సామాన్యుడు పొందే సమగ్ర రూపమే సంపూర్ణ మానవుడు. అంటే ప్రపంచాను భవం వున్న ఉదాత్త మానవుడే – "పగలు రేయి మరచి భావంబును మరచి / తాను నేనయన్న తలపు మరచి / యుండు వాని నెంచు నుత్తమ యోగిగా " అని నిర్వచనం చెప్పాడు వేమన. మానవ బుద్ధి సంపదకు అతడు సజీవ ఆదర్శం. " మనసులోని వాని మానుగా దెలిసిన / నుర్విజనులు వాని యోగి యంద్రు / నీవు నిన్నెరుంగ నీవె పో శివుడవు".

## మానవత్వపు విలువలు

మానవుడు వర్గం, కులం వుచ్చులో నిత్యం బతుకుతాడు. దీన్ని అధిగమించలేక పోతున్నాడు. జాతీయ భావం కుదరటం లేదు. అదే కదా ముఖ్యం. మానవ పతనానికి సంఘమే కారణం. కనుక కొత్త సాంఘిక జీవితానికి పునాదులు పడాలి. కనుక సంఘాన్ని మార్చాలి అని వేమన తలిచాడు. అప్పుడే





వ్యక్తి చైతన్యం వస్తుంది. అతని స్వాతంత్ర్యానికి అడ్డుపడకూడదు. మానవ జీవిత స్వాతంత్ర్యమే అతని వజ్రకవచం. కనుక వర్గ, కుల విభేదాలు మరవాలి – మరిచేట్లు చేయాలని " సాను జాతమయ్యె సకల కులము / హెచ్చు తగ్గు మాట లెల్లెరుంగ గ్గ వచ్చు ? " అని ప్రశ్నించాడు. అందుకే "ఎరుక గలుగు మనుజుడీ జాతాకలవాడు " అని తీర్మానించాడు. అందుకే ఆవేశంగా అంటాడు వేమన " కూడ దేమి చేసె, కులమేమి చేసెను / భూమి యేమిచేసె, బొందికట్టి / నరుడు పడెడు పాట్లున గుబాట్లు చూడగా " / కులం, గోత్రం, విద్య చేత విర్ర వీగే వాళ్ళంతా "పసిడిగల్గు వాని బానిస కొడుకులు " / అని తిట్టేశాడు. సంపద వున్న వ్యక్తి, ఎంత లోపభూయిష్టుడైనా వాడిక సంఘంలో అతి గౌరవం చూపిస్తారు. కులం కంటే ధనం బలమై పోయింది. అందుకే అంటాడు " కులము కన్న మిగుల కలిమి ప్రధానంబు " అని. "అందరొకట గలయనన్న దమ్ము లెగదా " / అని నీతి బోధించాడు. మానవ గౌరవ సమానత్వం గాలిలో కలవరాదు. అందుకే ఆ సమానత్వం రావాలంటే "ఉర్వివారికెల్ల నొక్కకంచము పెట్టి / పొత్తు గుడిపి కులము పొలియజేసి / తలను చెయ్యి బెట్టి, తగనమ్మ జెప్పరా / " అని చాపకూడు తింటే కాని, అంతా ఒకటే అన్న భావం రాదన్నారు. ఇవాళ మన రాజకీయ నాయకులు ప్రచారార్భాటం కోసం యిలా కతుకుతూ, సమానత్వం చూపిస్తున్నట్లు నటిస్తునారు. హృదయంలోంచి రావాల్సిన మార్పిది. నినాదాల వల్క, శుష్క విధానాల వల్లరాదు – మనస్ఫూర్తిగా ఆచరణలోకి తేవాలని వేమన ఆనాడే బోధించిన పరమ సామాజిక సత్యం, సూత్రం, బ్రహ్మనాయుడు చాపకూడును ఆచరించి చూపాడు. గురునానక్ కూడ.

అస్పృశ్యతను అసహ్యించుకున్నాడు వేమన. "ముట్టు ముట్టనుచు మట్టరాదందురు / ముట్టుకుదరి యేమి, మూలమేమి ? / నవబిలమున మురికి నరుల కందరకును / పుట్టగానె పుట్టుముట్టు వేమ /పుటక, భేదంతో సంబంధంలేని

మానవ పవిత్రతను వేమన కోరాడు. శూద్రుడని, అస్పృశ్యుడని వేరు చేస్తే వేదన చెందాడు. మానవుడిలో భగవద్విషయమైన విద్యతేజస్సువుంటే, అందరి మానవుల్లోనూ వున్నట్లే కదానంటాడు. అలాంటి మాన మాదిగలలో "వానిలోన బల్కు వాని కులంబేది ? " అని శంకరాచార్యుల వారిని మూల వాని రూపంలో వున్న శివుడు ప్రశ్నించినట్లు ప్రశ్నించి – మనల్ని నిరుత్తరులను చేశాడు. 'మాట మార్చినవాడే మాల ' అని నిర్ధారించాడు. 'మాట నిలుపలేని మనుజుండు చండాలుడు " అని తీర్పుయిచ్చాడు. అంతేనా 'వాక్శుద్ధి లేని వాడు ఛండాలుడని, ఆత్మ మీద మనసు నిలిపిన వాడు మాలకాదని "మనసు నిల్పకున్న మహిమీద మాలడు " అని తేల్చాడు. కనుక మానవుడిగా పుట్టటం కాదు, తనను తాను మానవుడిగా సంస్కరించుకోవాలి అని వేమన భావం. ఆత్మ సంస్కారంలో వున్నతేడాయే మానవుల మధ్య భేదం. అందుకే "మంచి గుణము లేక మరిద్విజు డెట్లగు ? " అని గుణ ప్రాధాన్యాన్ని వివరించాడు. "అరిది గిట్టు వేళ నడుగుద్విజత్వంబు " అంటే చచ్చింతర్వాత కులాలు లేవు. మతాలు లేవు పొమ్మన్నాడు. మంచి జీవన విధానాన్ని అవలంబించిన వారే మానవులు.

## ధనం, దరిద్రం

దరిద్రంలో వుంటే మానవత వుండదు అన్న భావానికి ప్రాధాన్యత లేదు. డబ్బుతోనే అది లభిస్తుందనటానికీ వీలులేదు. ధనం కావాల్సిందే. ఆత్మ సంస్కారం విషయంలో డబ్బుకు విలుల లేదు. ధన వ్యామోహం పతనానికి దారి – "ధనము జూచినపుడె దగులు మనసు / కూలినప్పుడరయ కుసులెల్ల విరుగును / అని ధన ప్రభావం చెప్పాడు. ధనం స్వాభావం నశ్వరత్వమే. మానవ ప్రయోజనానికి ఉపయోగించే ధనమే విలువైనది. "కలిమిగలిగెనేని కరుణ లేకుండినా / కలిమి యేల నిలుచు కర్ములకును ? " / ధనం వున్నవాడికి





కరుణ, దయ, సానుభూతి, సహవేదన వుంటేనే ఆధనం రాణిస్తుంది. అర్హులకు, ఆర్తులకు ధనవంతుని ధనం చేరాలి. ధనవంతుడు ధనానికి ట్రస్టీ మాత్రమేనని గాంధీజీ టాటా, బిర్లాలకు ఎప్పుడూ జ్ఞాపకం చేస్తూండేవాడు. "దాన మిచ్చునపుడె తనకు దక్కె " అంటాడు. ధనాన్ని బడుగు జనానికి అందించమన్నాడు. అయితే ధనం లేకపోతే మనో నిశ్చలత వుండదని ఆయనకు తెలుసు. ఆధ్యాత్మిక శక్తి ధనం ముందు లౌకిక దనానికి విలువ లేదు. "ధైర్య మొదవదేని ధనము లేదు " అనీ చెప్పాడు. ధనానికి మేలు చేసే వక్తి వుందని చెప్పాడు. సంపదవల్ల ధనవంతులు చెడిపోతారు – కనుక జాగ్రత్త వహించాలి. లోకం రీతి తమాషాగా వుంటుంది. డబ్బుంటే వికారుడైనా మన్మథుడిగా ఆరాధాస్తారు. దరిద్రుడైతే మదనుణ్ణి అయినా మాలగా చూస్తారు. అందుకని "గౌనమే (గుణం) మూలము స్త్రీలకు / మనమే మూలంబు ముక్తి మహిమకు వేమా "/ అని ధర్మ సూక్ష్మం వివరించాడు. "ఇచ్చేవారల సంపద /హెచ్చేదేకాని, లేమి యేలాకలుగున్ ?" అని సద్విని యోగ మైన ధనం సంపదలనిస్తుందని చాటి చెప్పాడు. ఎటువంటి కోరికా లేకుండా, ప్రతిఫలా పేక్ష లేకుండా చేసిన దానం శోభిస్తుంది. వచ్చే విప్పుడు, పోయే ధనం మనిషిని సేవించాలి కాని, మనిషి ధనానికి బానిసకారాదు. " ధనమెచ్చిన మనమెచ్చును / ధనమెచ్చిన దురుణంబు మానక యెచ్చున్ / ధనముడిగిన మనముడుగును / మనముడిగిన దుర్గుణంబు మానుమువేమా / " అంటూ డబ్బ టుది పవర్ ఆఫ్ డబ్బు ( డబ్బు డబ్బు ) సూత్రం చెప్పాడు ఆనాడే, మానవ సేవకు ధనం ఉపయోగించాలి. మానవుల మధ్య సత్సంబంధ సంధాయక శక్తిగా ధనం పని చేయాలి. దానం ధర్మ ఆముష్మక ప్రాప్తికి దారి చూపుతుంది. ధన సంపదతలో ధర్మ సంపద సాధించాలి. మానవ కళ్యాణమే ధనం ధ్యేయం కావాలి. గర్వంతో, కళ్ళుమూసుకుంటే సమాజం పతనమౌతుంది. సంపద్గర్వం వినాశ హేతువు.

ధనం అవసరమేకాని, నిత్యం ధన సంపాదన యావ పతనాన్ని కల్గిస్తుంది. దరిద్ర మానవుడంటే వేమనకు జాలి. అతనిస్థితి అర్థం చుసుకొన్నాడు. దరిద్రం అతన్ని పరిసరాలను చెడగొడ్తుంది. "ధనము లేమియనెడు దావానలంబు /తన్ను జరచును, దరిదాపు డెరచు / ధనములేమి చూడ, దలచనే పాపంబు / " అని బాధపడ్డాడు. ఈ స్థితిలో దరిద్రునికి మంచిమాట లేని చెప్పినా రుచించవు. జీవితం రుచి, వికాసం అర్థం చేసుకోలేడు. అతని ఇంద్రియ వ్యాపారం నశిస్తుంది. అలాంటి వాడికి సహకారం, సాయం సానుభూతి కావాలి. "ధనములేమి ఎవరికి తాళికై యుండదు ? " అన్నాడు. అందుకే వారి పక్షాన నిలిచి, ఉద్ధరించాలనుకున్నాడు. ధనం లేకపోతే కులం లేదు, కీర్తిరాదు, శుచి శుభ్రం వుండవు, గౌరవం రాదు. ఈనిన పులిలా ఖాంద్రు ఖాంద్రు మంటాడు. మానవత్వం చేసిన మహాపాపమే దరిద్రం అంటాడు."పేదను పొడగను వాడున్ / కాదని శవ మనుచు జూచు గదరా వేమా ? / అని దరిద్రుడు శవంతో సమానంగా సంఘంలో చూడబడుతున్నాడు. "శవం - శివం " కావాలి. ఎలా ? దరిద్రం భిక్షాపాత్రను చేతికిస్తుంది. భిక్షా వృత్తి కూడ దరిద్రం లాగ హీనమైందే. కనుక వారిపట్ల ఔదార్యం చూపాలి. "బడుగు నెరుగలేని ప్రాభవంబిది యేల ? / ఆకలన్నీవారి కన్నంబు బెట్టితే / హరున కల్పితముగ నారగించు "/ అని దరిద్ర నారాయణ సేవచేయాలన్నాడు. ఆ పనులన్ని యజ్ఞ యాగాదులంతటి పవిత్ర కార్యాలు. దారిద్ర్య సమస్యకు నైతిక బాధ్యత వహించాలి. "పెట్టినంత ఫలము, పెక్కం గ్రకుపహతి / జేయకున్న తాను చెరుప కున్న /పెండ్లి చేయునట్టి పెద్ద ఫలంబురా / " అని దరిద్రునికి చేసే సేవా ఫలం కన్నాదాన ఫలితం లాంటిదని పవిత్రతను ఆపాదించి ప్రోత్సహించాడు. 'దీనులకు దయతో దానమిచ్చినవాడే పుణ్య జనుడు ' అని వివరించాడు. దరిద్రుని కాపాడటానికి అవసరమైతే ఆవతలవారిని చేయుచాచి అడగటం తప్పులేదన్నాడు. "దిక్కు లేని





రోగి దీనత బాపిన / పురుషుడి హముననందు పూజ్యుడగును / పరమునందు వాని భాగ్యమే మనవచ్చు ? " అని ధర్మాత్మునికి గౌరవం లభిస్తుందని వివరించాడు. ఇందులో మరి మెరమెచ్చుల కోసం దానం చేసే వార్ని హీనులుగా చూశాడు. మనిషిగా పిలిపించుకోవటానికి, సుగుణ సంపద పెంచుకోవటానికి యిలాంటి దరిద్ర సేవ, సహాయం మంచి సాధనాలు. దరిద్రం వల్ల మానవ సంబంధాలు చెడిపోతాయి. పేద అయితే పెళ్ళాం కూడా మాట వినదు. దరిద్రుడిని అందరూ ద్వేషిస్తారు. రోతగా చూస్తారు. అతని నిట్టూర్పులు అందరి ధ్వంసానికి కారణం అవుతాయి. కనుక దారిద్ర్య నిర్మూలనం ప్రభుత్వం పనే కాదు, వదాన్యులు, మాన్యులు, సామాన్యులు కలిసి సాధించాల్సిన సాంఘిక సేవా కార్యక్రమం. సమాజోద్ధరణ జరగాలంటే దారిద్ర్యం దరి దాపులో వుండరాదు. లోభ గుణం వదిలేయాలి. ఆపద్బాంధవులుగా నిలవాలి. ఉద్ధరణ అందరి ధ్యేయం కావాలి. సమసమాజం రావాలని చెప్పే సోషలిస్టు భావాలకు పునాది ఆనాడే వేమన వేశాడు. వేమన కంటే పెద్ద సోషలిస్టు లేడు.

## జీవిత భ్రాంతి

మానసిక క్రమశిక్షణ లేకుండా ఆత్మ సంస్కారం రాదు. కర్మకాండలు, యజ్ఞ యాగాదులు మనిషికి ఒకవైపు లాగుతూ వుంటాయి. వాటిని వదిలి పెట్టే ధైర్యం వుండదు. అందులో యేదో విశేషం ఆకర్షిస్తుంది కాని అందులోని మర్మం తెలీదు. కోరికలు, కలలు, శకునాలు, ప్రశ్నలు యివన్నీ అతన్ని వుక్కిరి బిక్కిరి చేస్తాయి. మానవ జీవితంలో శరీర తత్వంతో పాటు ఆధ్యాత్మిక తత్వం కూడ వుంది. ఆశక్తిని జాగృతం చేసుకోడు. శరీరానికి ఆత్మకు వున్న సంబంధం తెలుసుకోలేడు. నిజమైన జ్ఞానం కలిగితే, ఎంతో ఉన్నంతగా ప్రవర్తిస్తాడు.

ఆధ్యాత్మిక ప్రకాశం లేని భౌతిక జీవితం గొప్పదైనా, నిరర్థకమైనదే. ఈ దేహం కోసం యెన్నోపాట్లు పడతారని హేళన చేశాడు వేమన. మాయామేయజగంయిది. 'మాయ బ్రతుకు కింత మాయ గప్పిస్తివి " అని మాయలో పడద్దనివారిస్తాడు. నీటి మీద వ్రాత లాంటిది సంసారం. నేనేమి కావాలి ? అన్న ప్రశ్న వేసుకోవాలి. "వచ్చేదిని పొయ్యేదిని / చచ్చేదిని గనగ లేక సహజములనుచున్ / విచ్చల విడిగా దిరుగుట / చిచ్చున బడినట్టి మిడుత చెలువము వేమా " / అంటూ విశృంఖలత్వం పనికిరాదని చెప్పాడు. శాంతిని గురించి ఆలోచించాలి. చిత్తశాంతి అందులో చాలా ముఖ్యం. నిత్యానందం వుంటే దు :ఖం వుండదు. "మాయను చెరసాల, మనసను గోలు సేను / భేదమనెడు బొండ బెరసియుండు / ఇట్టి బద్ధజీవి కెన్నండు మోక్షంబు ? " మాయాబద్ధులకు మోక్షం రాదు. బంధ విమోచన జరగాలి. జీవిత భ్రాంతి పోవాలి.

## ప్రపంచమే శిక్షణా స్థలం

ఈ ప్రపంచాన్ని వదలక్కర్లేదు. ఇక్కడ వుంటు, తన ఉన్నతికి, సంస్కారానికి మానవుడు ప్రయత్నం చేయాలి తప్ప అడవులకో, గుహల్లోకి పారిపోనక్కర్లేదు. ప్రపంచమే గొప్ప శిక్షణా కేంద్రం. అందుకే "ఇల్లు, నాలు విడిచి, యినుప కచ్చల గట్టి / వంటకంబు, నీరు, వాంఛలుడిగి / వంటి నున్నయంత వచ్చునా తత్వంబు ? " అని కేకలేస్తాడు. ప్రపంచంలోని సర్వజీవులు ఒక్కటే అనే భావం రావాలి. "ఇహము విడిచి ఫలము లింపుగలవని / మహిని బల్కు వారి మతము కల్ల / ఇహము లోన బరము నెసగుట గానరో ? " అని ఇహంలోనే పరాన్ని చూడమన్నాడు. ప్రపంచాన్ని వదిలేయటం మంచిది కాదు.





ప్రపంచ పరిత్యాగం, మానవ సంస్కారాన్ని పెంచను. అలా చేస్తే వారంతా యాచకులవుతారు. మానవతా కాంతి వుండదు. వారు ధరించేవన్ని బాహ్య సన్యాస చిహ్నాలే. అందుకే " గ్రామము, భూములు మానుక / ప్రేమయు దయ యింత లేక భీకరమతులై / భామల సుతులను వధలుక / బాముల బడనేల, యడవి పట్టున వేమా ? " అని ప్రపంచంలోని శాంతిని వదిలి పారిపోవద్దన్నాడు. 'తలలుబోడులైన తలపులు బోడులా ? " అని ప్రశ్నించాడు. కావిపంచ కట్టినంత మాత్రాన యోగికాడు. పకీరులుగా, బికారులుగా తిరిగే యిలాంటి వారంటే వేమన చీదరించాడు. వాళ్ళంతా శాపోపహతులంటాడు. "మది ముక్తికి నా స్పదంబు మహిలో వేమా /" మనస్సు ముఖ్యం. వేషం కాదు.

## అసత్య జీవిత మార్గం

ఆత్మ శిక్షణకు, జీవిత విజయ సాధనానికి యోగం చాలా శ్రేష్టమైంది. అయితే మానసిక వైంగ్యం వాళ్ళలో చాలామందికి వుండదు. డాంబికంగా వుంటారు. సత్యాన్ని తెలుసుకోవాలనే కోరిక బహు తక్కువమందికి వుంటుంది. ఆత్మ సంస్కారవంతులు తక్కువ. అలాంటివారిని గురించి "కలియుగమునను బుట్టి కడతేరగాలేక / యొడలు బడలజేసి, యుగ్ర తపము / తమరు చేసి యేమి, తత్వముగన లేరు " అని వీళ్ళను తెలిగ్గాతీసి పారేశాడు వేమన, కాలు చేయువంచి, గాలి నిండా పీల్చి, నేలమీద వ్రాలి కొన్ని, నిలిచి కొన్ని ఆసనాలు వేస్తారు. లోచూపు జూడ నొల్లక / వాచా బ్రహ్మంబు బలుక వద్దుర వేమా ? / మాటలు కాదు, చేతల్లో చూపించామని సవాలు చేశాడు. రాజయోగి అంటే తానే బ్రహ్మం అని తెలుసుకొన్నవాడు. "శాంత మానసమున జల్లనై, శీతల / భాతి నున్నవాడు పరమయోగి " / లాంటివాడే ముక్తిని వేగంగా సాధిస్తాడు.

# "జీవిత బంధాలు - పరిభ్రమణం "
# - సత్యం ఒక్కటే "

కర్మకాండ ఆధ్యాత్మికంగా అంధకారంలోకి నెట్టుతుంది. భేదాలు పెరుగుతాయి. దేవతకు చేసే ఉపాసన, మానవ మిక్యాన్ని సాధించాలి. కర్మానుష్టానం ప్రాపంచిక లాభం యివ్వచ్చు. కాని ధర్మశాంతి, సౌఖ్యసిద్ధి కలుగవు. ఆత్మ చిక్కులూ పినవాడే ఘనయోగి అన్నాడు యోగివేమన. ఆత్మ శుద్ధిలేని ఆచారం కూడదు. తీర్థయాత్రలు మానవ కళ్యాణ మార్గాలు కావు. హృదయంలో మార్పురాదు. "ఒడలు శుద్ధిచేసి ఆచారం యెడయని జూడరా " అన్నాడు. జీవితంపై ఉదాసీనత పనికిరాదు. అలా చేస్తే మానవుడి మీద గౌరవమే పోతుంది. మానవీకృత సంస్కారమే మానవుని జీవితానుభవం. చెప్పటం తేలిక. చేసి చూపటం కష్టం. ఔదార్యం మానవాభ్యుదయానికి అలంకారం. క్రూరభావాలు మానవ వ్యక్తిత్వాన్ని భ్రష్టుపట్టిసాయి. 'ఆస పాపజాతి అన్నిటికంటె " అన్నాడు. పాపం యెక్కడో లేదు. తను చేసే కమ్మలోనే వుంది. కల్లలాడటం కష్టాన్ని కొని తెలుస్తుంది. 'చంపదగిన యట్టి శత్రుడు తన చేత / జిక్కెనేని కీడు సేయరాదు / పోసగమేలు చేసి పొమ్మనుటే చాలు " అన్నీ సర్వకాల సత్యం చెప్పాడు. మనశ్శాంతి అంటె ఇంద్రియాలను సంస్కరించటమే. అణచివేయటం కాదు. 'అన్న మధికమైననదియు దాజంపునా / యన్నమంటకున్న నాత్మ నొచ్చు / చంప, నొంప బువ్వచాలదా, ఐయ్యేల ? " అన్నం లేకపోతే చస్తాం. ఎక్కువ తిన్నా చస్తాం. చంపటానికి ఏవేవో కారణాలు కావక్కర్లేదు – అన్నం చాలు. ప్రకృతిని, తెలుసుకోలేకపోతే భక్తి లేదు. పాపానికి వెరవాలి. "మరువంగా వలదు మేలు " చేసిన మేలు మరిస్తే కృతఘ్నుతే. ధనం ఎవరి సొమ్ముకాదు – ధర్మమే తన సొమ్ము. కోకిల వనంలో హాయిగా విలసిల్లినట్లు ప్రాజ్ఞుల పలుకులు మానసికానందానిస్తాయి.





నిజమైన గురువు మార్గదర్శిగా వుండాలి. మత గ్రంధ పఠనం వల్ల ప్రయోజనం అంతగారాదు జీవితపు లోతుల శోధనకు అది చాలదు. స్వానుభూతి కావాలి. గురువంటే పరమాత్మ. శిష్యుడు జీవుడు. 'గురు శిష్య జీవ సంపద / గురు తరముగ గూర్చునతడు గురువగువేమా "/ అని యదార్ధ గురు దర్శనం చేయించాడు. మానవుని మోక్షం అతని చేతుల్లోనే వుంది. "సకలాకారుడనంతుడు / సకలాత్మల యందు సర్వసాక్షియుదానై / సకలమున నిర్వికారు/డక లంక స్థితిని, బ్రహ్మమనబడువేమా /" సందేహాలు, అనుమానాలు భగవారాధీనలో తొలగిపోతాయి. భయం వదలాలి. అజ్ఞానమే భయం. భయం పోతే జ్ఞాన సూర్యోదయమే ఈ దేహంలయం కావాల్సిందే. । "జయమే సుమీ జీవుడనుచు చాటరవేమా ," కనుక సంసార జీవితంలో వుంటూ, తామరాకుపై నీటి బొట్టుగా ప్రవర్తిస్తూ, భగవంతునితో అనుక్షణం మానసికంగా గడిపే మానవుడే సర్వస్వతంత్రుడు భగవంతుడే సత్యం. సత్యం తెలిస్తే ఆత్మవశమైనట్లే. సత్యమే దైవం. విజ్ఞానమే దైవం. నిన్ను నీవు తెలుసుకుంటే భగవంతుణ్ణి తెలుసుకున్నట్లే. చావుకు భయపడరాదు. ప్రళయం రాక తప్పదు. ఆత్మ జ్ఞానమే నావ. "ధరగిరులు, జలధులన్నియు / పరికింపంగ ప్రళయమును భస్మాకృతులే / సురలును, మునులును జనగా / నెరయోధులు నుండగలరె నేర్పునవేమా ? / ఇంతటి పరిణత భావాలను వేమన విరబూలుంచాడు. వాటిని తన నిశిత దృష్టిలో డాక్టర్ ఈశ్వరతోపాగారు పరిశీలించి మనకు అందించారు. వేమన హృదయాన్ని, మానవీయ కోణంతో అందించిన తోపాగారు మనకు చిరస్మరణీయులు, 'తోపా ' గారు వేమనకు అక్షరాభిషేకం చేశారు. వేమన పద్యాలు భావాలు ఆణిముత్యాలు, అక్షర సత్యాలు. తరగనివి, వాసిచెడనివి వాడి వీడనివి. అచ్చమైన ప్రగతిశీల సజీవ కవితా చైతన్య మూర్తివేమన అందుకే ఆయన "జన వేమన " అయినాడు.